# సరస్వతీసాక్షాత్కారము

## అనుముల కృష్ణమూర్తి

ప్రచురణ




రిజిస్టర్డ్ సంఖ్య 1/64

యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ, 5, కింగ్సువే, సికిందరాబాదు-3

SARASWATHY SAKSHATKARAMU
An anthology of Poetry by
ANUMULA KRISHNA MURTY

యువభారతి

ప్రచురణ : 1

ప్రథమ ముద్రణ : 3000 ప్రతులు
మార్చి 12, 1967

ద్వితీయ ముద్రణ : 5000 ప్రతులు
జనవరి 26, 1973

ముఖపత్ర రచన; అక్షరాలంకరణ :
సుధామ

ముద్రణ :
నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ :
విస్టాస్ ప్రింటర్స్

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాదు-3.

వెల : మూడు రూపాయలు

# ఆకాంక్ష

[ద్వితీయ ముద్రణ]



'సరస్వతీ సాక్షాత్కారము' మొదటి ముద్రణ ఆరేళ్ళక్రిందట జరిగింది. ప్రప్రథమంగా ప్రచురణ పూర్వ విరాళాల పద్ధతిని ప్రవేశపెట్టి, చక్కని సాహిత్యాన్ని వీలైనంత తక్కువ ధరకు అందించాలని మేము చేసిన తొలియత్నం అది. ఈ యత్నానికి మంచి ప్రోత్సాహమే లభించింది. 3000 ప్రతులు వేశాము. తరువాత ఖలీల్ జిబ్రాన్ The Prophet కు కాళోజీ అనువాదం 'జీవనగీత' 6000 ప్రతులు, ఆచార్య దివాకర్లవారి ఉపన్యాస సంపుటి కావ్యలహరి 11500 ప్రతులు, జాతిని జాగరితం చేసిన మహితాత్ముల గూర్చిన ఉపన్యాస సంపుటి 'చైతన్యలహరి' 15000 ప్రతులు, స్వాతంత్ర్య యుగోదయంలో తెలుగు తీరుతెన్నులపై 100 వ్యాసాల సంకలనం 'మహతి' 12000 ప్రతులు, ఫ్రీ ఇండియా ఫోర్జెస్ అహెడ్ పేరిట 34 ఆంగ్ల వ్యాసాల సంకలనం—4,000 ప్రతులు రచన—37 వ్యాసాల సంకలనం పునర్ముద్రణ 3,000 ప్రతులు—మేము ముద్రించి పాఠకలోకానికి అందించగలిగాము. తక్కువ వెలకు ఉత్తమ సాహిత్యాన్ని అందించడం యువభారతి ఒక ఉద్యమంగా నిర్వహించాలని ఆశిస్తున్నది. ఈ ఆరేళ్ళలోనూ యువభారతి కృషి విస్తృతమయింది.

మా మొదటి ప్రచురణగా మాకు అత్యంత ప్రీతిపాత్రమైన ఈ కావ్యం— సాహితీ జగత్తులో సముచితస్థానాన్ని పొంది, పలువురి మన్ననలను పొంది, ఇప్పుడు ద్వితీయ ముద్రణగా వెలువడుతోంది.

పద్యాన్ని ద్వేషించడం నుండీ, చూసి, భయపడి దూరం జరిగేంతవరకూ—వివిధ స్థాయిలలో విముఖత వ్యాపిస్తున్న ఈ తరుణంలో—ముఖ్యంగా యువతరంలో చక్కని రసపుష్టి కలిగిన కావ్యాన్ని సరసమైన ధరకు అందించాలని—మా సాహితీ మిత్రులుగా చేరేవారికి ఉచితంగానూ, నేరుగా మావద్ద కొనేవారికి కేవలం ఒక రూపాయకే అందిస్తున్నాం.

ఈ రెండవ ముద్రణలో—దాదాపు 50 పద్యాలు అదనంగా చేర్చి, మరోసారి మాపై గల తమ అవ్యాజాభిమానానురాగాలను ప్రకటించిన కవులు శ్రీ అనుముల కృష్ణమూర్తిగారికి కృతజ్ఞతలు.

ప్రచురణ విషయమైన సలహాల నందించి తోడ్పడడమే గాక, ప్రత్యేక వ్యాసాన్ని అందించి ఆదరణ ప్రకటించిన మా గౌరవ సభ్యులు, మా ప్రచురణ ప్రధాన సంపాదకులు, డాక్టర్ జి. వి సుబ్రహ్మణ్యముగారికి వందనములు. ముద్రణ బాధ్యతను, అతిస్వల్ప వ్యవధిలో ముగించి, సహకరించిన నాగార్జున ప్రింటింగ్ వర్క్స్ వారికి, అందంగా అలంకరించడములో బాధ్యత పంచుకున్న మా సభ్యులు శ్రీ అల్లంరాజు వెంకట్రావుగారికి కృతజ్ఞతలు.

ఉత్తమ సాహిత్యాధ్యయనానికి అనువైన అవకాశాలను కల్పించడానికి యువ భారతి చేస్తున్న కృషికి సహృదయుల అండదండలు లభించగలవని ఆశిస్తున్నాము.

వి. విశ్వనాథం
26 జనవరి 1973 సమావేశకర్త, యువభారతి.

# నివేదన
## [ ప్రథమ ముద్రణ ]

ఈ చక్కని రసపుష్టి కలిగిన కావ్యాన్ని మీకు అందించాలని మేము చేసిన తొలి ప్రయత్న మిది. మా ప్రయత్నం చిన్నదన్నమాట వాస్తవం. రాయిరాయికి మధ్య వరాయి తనము తగ్గింపగ ఉడుత రాల్చినట్టి ఇసుక మాదిరిగా ఉడుతాభక్తిగా మేము చేసిన యత్న మిది.

అడిగినవెంటనే, శ్రీ అనుముల కృష్ణమూర్తిగారు పుస్తకప్రచురణకు ఆమోదించడం మా అదృష్టం. కాదనకుండా ఉపోద్ఘాతము వ్రాసి యిచ్చారు డా॥ సి. నారాయణ రెడ్డిగారు. అది మా భాగ్యం.

సరస్వతీ సాక్షాత్కారానికి, లక్ష్మీకటాక్ష మవసరంగదా ః సహృదయులనుండి ముందుగా విరాళాలు ప్రోగుచేసి ఆ ధనసహాయంతో, ఈ కావ్యాన్ని ముద్రించగలిగాం. మరి "ఎందరో మహానుభావులు, అందరికీ మా వందనములు.''

విరాళాల సేకరణలో తోడ్పడిన మిత్రబృందానికి ప్రత్యేకంగా కృతజ్ఞతలు చెప్పుకోవాలి. వాళ్ళ హృదయపూర్వక సహాయం లభించిఉండకపోతే,పుస్తకాన్ని మీ ముందుంచడానికి వీలువడుండేది కాదు. ఎవ్వరి పేరు చెప్పి, ఎవ్వరిని మరువాలి ? వారందరికీ హృదయపూర్వక నమస్సులు.

ముఖచిత్రం వేసియిచ్చిన మా సభ్యుడు, శ్రీ తంగిరాల లక్ష్మీనారాయణగారి అభివందనములు. ఈ పుస్తక ప్రచురణ సందర్భంలో విశేషంగా బాధ్యత వంచుకొన్న సభ్యులు శ్రీ డి. శ్యాంసుందర్‌కు కృతజ్ఞతలు.

అందంగా ముద్రించి యిచ్చిన శ్రీ రామా పవర్ ప్రెస్ అధినేత, శ్రీ పబ్బా శంకరయ్యగారిని, కృతజ్ఞతలు తెలియచెపుతున్న ఈ సమయంలో, ఎలా మరుస్తాయి ?

దారితప్పి దొర్లిన, కొన్ని అచ్చు పొరపాట్లను ...................మన్నించా లని మనవి.

లాభాలు, అధికలాభాలు పొందడమే ధ్యేయంగా వున్న పుస్తకప్రచురణలోకంలో, అటు కలంపట్టినవారికీ, ఇటు ప్రచురణ బాధ్యత వహించినవారికీ, దాదాపు ఏమీ లేకుండా తక్కువ ధరతో పుస్తకాన్ని అందించడం సాహసమే అయింది. ఆంధ్ర పాఠకలోకం తమ సహృదయాన్ని పునః ప్రదర్శించడానికి వెనుకాడకపోతే..................మళ్ళీ మేము ఇలాంటి ప్రయత్నం మరొక్కమారు చేయటానికి సాహసించవచ్చు. -యువభారతి

# మాగురించి




గతంలోని మంచిని జీర్ణించుకొని; వర్తమానాన్ని సక్రమంగా అవగాహన చేసుకుని సమ్యక్ దృక్పథంలో పయనించడానికి యువతరం ఉద్యమించగలిగినప్పుడే, జాతీయ శక్తులు ఉద్దీప్తిని పొందగలుగుతా యనే విశ్వాసంలో చైతన్య ముంది. ప్రగతికామన ఉంది. దేశభక్తి ఉంది. ప్రజాస్వామ్య జీవితవిధానంపట్ల నమ్మకం పెరిగి, సాహిత్యం మీద అభిమానం పెరిగి, భవిష్యత్తుపట్ల ఆశలు మొలకెత్తి, వ్యక్తి పురోగమించ గలిగే వాతావరణం ఏర్పడడం ఎంతైనా అవసరం. జాతీయజీవనంలో నిర్లిప్తత గూడుకట్టుకొని ఉన్నదనీ, ఏవేవో క్రీనీడలు వెలుగుబాటను కప్పేస్తున్నా యనీ, సామాన్యునికి అభ్యుదయం అందుబాటులో లేకుండా పోతున్న దనీ, స్వార్థం పడగెత్తి బుసలుకొడుతున్న దనీ ఎవరికైనా అన్పిస్తుంది. అందువల్లనే "చుట్టూరా ఆవరించుకొని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకంటె ప్రయత్నించి ఎంత చిన్నదీపాన్నయినా వెలిగించటం మంచి" దనే సూక్తి మా ఊపిరి. ఈ సూక్తి ఇచ్చిన స్ఫూర్తి 1963 విజయదశమినాడు "యువభారతి" గా రూపుగొన్నది.

* దేశానికీ, సంఘశ్రేయస్సుకూ అనువైన పద్ధతిలో పరిపూర్ణవ్యక్తిత్వాన్ని సభ్యులలో పెంపొందింపజేసి వారిని యుగోచితాగ్రగామిత్వానికి సన్నద్ధులను చేయడం.

* పరిపూర్ణమైన, సమగ్రమైన వ్యక్తిత్వనిర్మాణానికి తోడ్పడేవిధంగా వచోరీతినీ, రచనాపాటవాన్నీ, అలవరచే అధ్యయనశీలతనూ ఆలోచనాశక్తికి దోహదం చేసే కార్యక్రమాలను నిర్వహించడం.

* సభ్యులలో మంచి అభిరుచులను కలిగించేందుకు, వైజ్ఞానిక, సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలను ఈ లక్ష్యసాధనకోసం రూపొందించి, కడచిన తొమ్మిదేండ్లుగా యువభారతి నిర్మాణాత్మకదృక్పథంతో సాహిత్యోద్యమాన్ని నిర్వహిస్తున్నది.

ప్రతినెలా, మొదటి ఆదివారం, మూడవ ఆదివారం మధ్యాహ్నం రెండున్నర గంటలకు హైదరాబాదులో నున్న శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయంలో యువభారతి

నిర్వహిస్తున్న సాహితీసమావేశాలు సభ్యుల ప్రతిభోద్దీపనానికి, వ్యుత్పన్నతానముపలబ్ధికి యథోచితమైన అవకాశాలను కలిగిస్తున్నాయి.

ప్రతిమాసం మొదటి ఆదివారం ఉదయం పదిగంటలకు అదే గ్రంథాలయంలో యువభారతి వనితావిభాగం ఇదే లక్ష్యంతో సాహిత్యకార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

"క్లుప్తగోష్ఠి", "పుస్తకచర్చ", "ఊహాపథంలో", "రసధుని", "నాకు నచ్చినది-నేను మెచ్చినది", నాగురించి". "స్వీయ కవితాపఠనం", "వక్తృత్వపరిశీలనం", "చర్చాగోష్ఠి" వంటి వివిధకార్యక్రమాలను రూపొందించి యువభారతి నిర్వహిస్తున్నది.

ఏవిధమైన కార్యక్రమాలను నిర్వహించినా సభ్యులందరూ వాటిలో పాల్గొనే విధంగా అవి రూపొందించబడుతాయి. తొలిదశలో "యువభారతి" అనే పేరుతో ఒక సైక్లోస్టైల్డ్ మాసపత్రిక ఒక ఏడాదిపాటు వెలువడింది. చక్కని నాటకాలను యువభారతి సభ్యులు ప్రదర్శించారు.

సాహిత్యాసక్తిని ఇతోధికంగా ఇనుమడింపజేయడానికీ, తక్కువవెలకు ఉత్తమ సాహిత్యాన్ని అందించటానికీ ప్రచురణ పూర్వవిరాళ పద్ధతిని రూపొందించి "సరస్వతీ సాక్షాత్కారము", "జీవనగీత", ఐదు ఆంధ్రకావ్యాలపై ఆచార్య దివాకర్ల వారి ఉపన్యాస వ్యాసమంజరి "కావ్యలహరి", జాతిని చైతన్యవంతం గావించిన ఐదుగురు పవిత్ర మూర్తులపై ఉపన్యాససంకలనం "చైతన్యలహరి", స్వాతంత్ర్యయుదోదయంలో తెలుగు తీరుతెన్నులపై నూర్గురు రచయితల వ్యాససంకలనం "మహతి", స్వాతంత్ర్యరజతోత్సవ సందర్భంగా భారతజాతికి యువభారతి సమర్పించుకొన్న కానుక 34 గురు ప్రముఖుల ఆంగ్లవ్యాసాల సంకలనం "ఫ్రీ ఇండియా ఫోర్జెస్ ఎహెడ్" అనే గ్రంథాలనూ సభ్యుల ఆర్థికసహకారంతో "పిచికలు", "అక్షరాలు" అనే కవితాసంకలనాలను, ఐదుగురు ప్రసిద్ధ కథారచయితల కథలను "పంచవటి" గానూ యువభారతి ప్రచురించింది. యావద్భారత స్థాయిలో శేషాచలం అండ్ కంపెనీవారి సహకారంతో విద్యార్థుల కథారచన పోటీనీ, స్వాతంత్ర్యరజతోత్సవ సందర్భంగా యువతీయువకులకు వక్తృత్వ వ్యాస రచనపోటీలను నిర్వహించింది.

ఇవిగాక 1970 లో యువభారతి "మారుతున్న విలువలు-రచయితల బాధ్యతలు" అనే అంశంపై గోష్ఠి నిర్వహించి ఆ సందర్భంగా 37 గురు ప్రముఖ సాహితీవేత్తల నుండి ప్రత్యేకంగా వ్యాసాలు తెప్పించి "రచన" గా ప్రచురించింది.

తెలుగు గ్రంథప్రచురణ చరిత్రలో అపూర్వమైన విజయాన్ని యువభారతి సాధించింది.

యువభారతికృషికి దోహదం చేసే మిత్రులకోసం సాహితీమిత్రపథకం రూపొందించింది. సాహితీమిత్రులుగా చేరి, మా సాహిత్యోద్యమ నిర్వహణలో బరువుబాధ్యతలు పంచుకునే సహృదయం సహకారాన్ని ఆకాంక్షిస్తున్నది. ఇప్పటికి 1100కు పైగా,

సహృదయులు సాహితీమిత్రులుగా చేరారు. 1973 లో 3 రూ॥ల ప్రచురణ పూర్వవిరాళానికి అందజేయబడే పుస్తకం ఈ పథకంలో చేరినసభ్యులకు ఉచితం. సాహితీమిత్రులకు అనేకసదుపాయాలుకూడా ఉన్నవి.

సాహిత్యాభిమానుల ఆదరాభిమానాలతో మరింతప్రయోజనకర మైన, సాహిత్యాత్మకమైన కళాత్మకమైన కార్యక్రమాలను రూపొందించా లని యువభారతి సంకల్పం. సాహితీస్నేహమే పరమలక్ష్యంగా పెట్టుకున్న యువభారతికి సరసులైన తెలుగుప్రజల సౌహార్దం బాసటగా నిలుస్తుం దని విశ్వసిస్తున్నాం. ఆంధ్రుల రాజధానీనగరంలో తెలుగుతనం తొణికిసలాడాలనీ, తెలుగు వాతావరణం నెలకొనా లనీ మా ఆకాంక్ష.

యావద్భారత ప్రజాజీవితంలో తెలుగువారి పార్థక్యానికి, వైశిష్ట్యానికి, శక్తిసామర్థ్యాలకు ఆదరణ లభించాలని మాకామన.

సాహిత్యం సహశీలతను, ఔదార్యాన్ని, సంస్కృతిని, సౌమనస్యాన్ని తెలుగుప్రజలలో కలిగించగలిగినపుడే జాతికి జీవంపోయగలుగుతుంది. ఉత్తమసాహిత్యప్రచారానికి సుందరమైన, సులభమైన, శుభావహమైన, సరసమైన వాతావరణం కల్పించడమే మా సంకల్పం.

యువభారతి యథోచితంగా కొనసాగగలదనీ, సాహితీతపోమూర్తుల సందేశాన్ని అందించగల దనీ, తెలుగుప్రజల ఆశీస్సులను పొందగల దనీ ఆశిస్తున్నాము.

26-1-1973.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు
యువభారతి

---




సాహితీ సమావేశాలు
ప్రతి నెలా మొదటి మరియు మూడవ ఆదివారాలలో
మధ్యాహ్నం 2-30 గంటలకు
శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం
సుల్తాన్ బజార్, హైదరాబాద్‌లో జరుగును
సహృదయులందరూ ఆహూతులే!

---

# యువభారతి




# ప్రచురణలు

1. సరస్వతీ సాక్షాత్కారము
   (రసపుష్టి కలిగిన కావ్యం) — అనుముల కృష్ణమూర్తి రు. 3-00
2. జీవనగీత*
   (మానవాళి నివాళులెత్తిన కారుణ్యోపనిషత్తు,
   ఖలీల్ జిబ్రాన్ The Prophet కు తెనుగుసేత);— కాళోజీ రు. 2-50
3. వీచికలు*
   (నలుగురు యువకవుల కవితాసంకలనం)
   కృష్ణమూర్తి, చక్రవర్తి, వెంకట్రావు, విశ్వనాథం రు. 2-00
4. పంచవటి*
   (కథల సంపుటి) — అవసరాల రామకృష్ణారావు, మంజుశ్రీ,
   శీలా వీర్రాజు, లత, సి. ఆనందారామం రు. 2-00
5. రచన
   (మారుతున్న విలువలు - రచయితల బాధ్యతలు - గోష్ఠిపై
   37 గురు ప్రముఖుల వ్యాససంపుటి) రు. 7-00
6. కావ్యలహరి* - ఉపన్యాసమంజరి
   (ప్రాచీనాంధ్ర ప్రబంధాలకు మణిహారం)
   ఆచార్య దివాకర్ల వేంకటావధాని రు. 5-00
7. అక్షరాలు*
   (పదముగ్గురు యువభారతీయుల కవితా సంకలనం) రు. 2-00
8. చైతన్యలహరి - ఉపన్యాసమంజరి
   (ఐదుగురు చైతన్యమూర్తులపై వ్యాసరూపక ఉపహారం) రు. 6-00
9. మహతి - స్వాతంత్ర్యయుగోదయంలో ఆంధ్రసారస్వత సందర్శనం
   (నూర్గురు ప్రముఖుల వ్యాససంకలనం) రు. 20-00
10. ఫ్రీ ఇండియా ఫోర్జెస్ ఎహెడ్
    (34 వ్యాసాల సంకలనం) రు. 10-00

---

* ప్రతులు లేవు

# యువభారతి

## త్వరలో రానున్న ప్రచురణలు

1. స్వరాలు – యువభారతీయుల కవితాసంకలనం

2. ఉషస్సు – యువభారతి సాహితీమిత్రుల కవితాసంకలనం

3. మళ్ళీ వెలుగు – శ్రీ శీలా వీర్రాజుగారి వచనకవితాకావ్యం

4. వికాసలహరి – జాతివికాసానికై దోహదం చేసిన ఐదుగురు మహనీయులపై ఉపన్యాస వ్యాస సంకలనం.

## మళ్ళీ వెలుగు

**(వచన కవితా కావ్యం)**

రచన: *శీలా వీర్రాజు*

* నగరజీవితాన్ని, సామాజిక వ్యవస్థను వివరంగా చర్చిస్తూ వ్రాయబడిన యీ గ్రంథాన్ని ఆధునిక ద్వ్యర్థికావ్యంగా పేర్కొనవచ్చు.

* ఉషస్సు, ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం, సంధ్య, రాత్రి, అర్ధరాత్రి– అని ఐదు అధ్యాయాలక్రింద, ఆయాసమయాలలో నగరజీవితాన్ని సమగ్రంగా ఆవిష్కరించిన వర్ణనాత్మక కావ్యం యిది.

* ఒక్కొక్క అధ్యాయాన్నీ ఒకొక్క సామాజిక స్థితికి సంకేతంగా స్వీకరించి, చైతన్యరహితమైన, జడమయమైన అర్ధరాత్రి చీకటి చిరకాలం నిలవదని, త్వరలోనే యీ చీకటి తొలగిపోయి మళ్ళీవెలుగు వస్తుందనే ఆశావాదాన్ని ప్రకటిస్తూ అభ్యుదయ భావవాహికగా నడిచిన ప్రగతిశీలక కావ్యం.

* తెలుగు కవితారంగంలో ఈ కావ్యం ఒక సరికొత్త ప్రయోగం.

# ఆముఖం

1. అంతలోనే అంబరాలకు రివ్వుమని యెగిసే పైచూపు
అంతలోనే అంతరాలకు తవ్వుకునిపోయే లోచూపు
చివికిపోతున్న పాతజగత్తును చూసి చిత్రంగా చేసే మందహాసం
ఆ మందహాసంలో పదును పెట్టుకుంటున్న పరిహాస చంద్రహాసం
దర్పణంలాంటి ముఖంలో ప్రతిబింబించే రసవంత రసవద్దర్పం
లౌక్యానికి దూరంగా, రాసిక్యానికి ఈవలితీరంగా
'హిమస్ఫుట శుభ్రంగా' ఎదిగిన రమణీయాంతరంగం—
ఇది మా అనుముల కృష్ణమూర్తి రూపచిత్రం
ఇదే కవిగా అతని స్వరూపచిత్రం.

2. కవికి సరస్వతీ సాక్షాత్కారం కలిగింది.
ఇప్పుడేనా ? కాదు; ఎప్పుడో కలిగింది ;
పుట్టినప్పుడే.
పుడమి ఒడిలో కాల్సేతులు కొట్టినప్పుడే.
పట్టుబట్టి తొలిసారిగా కలాన్ని చేపట్టినప్పుడే,
అయితే ఇన్నాళ్లుగా ఈ వాక్కు ఏమయింది ?
హృదయకులాయంలో పదిలంగా ఒదిగివుంది.
ఇప్పుడు రెక్కలు విప్పి విశాలవియత్తుల్లోకి ఎగిసిపోయింది.
"ఇది స్వప్నగీతమై ఎదవిణియల మ్రోగె"
ఇది పలుకు పలుకుగా ఎదతేనియల మాగె.
ఈ పంక్తుల్లో ధ్వనించే పరమార్థ మదే
ఈ సంపుటిలో జాలువారిన రసవదర్థమూ అదే.

3. కృష్ణమూర్తిలో పల్లవించిన ఆనందచేతన
కృష్ణమూర్తిలో ఒళ్లు విరిచిన జీవవేదన
ఆయన హృదయ సంపుటాన్ని చీల్చుకుని
నెత్తుటి తడిని హత్తుకుని
సరికొత్త వృత్తాలుగా, గీతాలుగా పోతబోసుకున్నవి.
ఆయన ప్రయత్నించి, మెదడు చించి, ఎట్టకేలకు
చేసిన మూసల్లో పోసిన పోతలు కానివి.
జిలుగునగిషీలను, నాజూకు చెక్కడాలను లెక్కచేయక
సంస్కారబలంతో అక్షరాకృతి దాల్చిన
శబ్దాల పడపోత లివి.

అలా కాకపోతే—
"నా కవితా సరస్వతికి
నాలుక లేదొక గుండెదక్క, మే
లౌ కనుచూవు లే దలుక
లావగునశ్రువుదక్క; తానుతా
నై కదలంగ లే దొకరి
యాసరవెంబడిపక్క; ఇంక ఏ
సాకును చూవి తాను మన
జాలునొ నల్వురినోటిముత్యమై."

ఈ పద్యం తీరిగ్గా చెక్కుతూ కూచుంటే తయారయ్యేదా?

"నన్నయ తిక్కనాదుల పు
నాదులు వేరు, మనాది లేని వా
రున్న దినాలు వేరు, మన
మున్నదినమ్ములు వేరు వారి క
ధ్వాన్నపు కూటిగుడ్డలకు
వాచిన దేజె ఎదల్ కనుల్ మొగా
లున్నవొ లేక బోలెడు మ
హోజ్జ్వలమైన తపస్సెయున్నదో!"

ఈ పద్యంలోని నిరర్గళధార
అంతంతమాత్రం ప్రతిభ వున్న కవికి అలవడుతుందా?

4. తాను వ్రాస్తున్నది అక్షరగణాల వృత్తమా?
లేక మాత్రాగణాల గీతమా?
ఈ లెక్కలదృష్టి కృష్ణమూర్తికి లేదు.
అయితే లెక్కలు తమంత తామే సరిపోవచ్చు.
కానీ గణాలను లెక్కపెట్టి పద్యాల్లో జొప్పించే
చప్పనిప్రతిభ కితడు చెప్పన్నమైళ్ల దూరంలో వున్నాడు.

"ఉరుము ఉరిమినది మెరుము మెరసినది; చె
లీ! పలుక లేదు; నవ్వను లేదు నీవు
వాన వెలిసినది పరద పారినది, చె
లీ! కదలలేను పాడగాలేను నేను."

ఇది పద్యమా? గేయమా?
ఇది పద్యం కాదు; హృద్యం
గేయం కాదు; ప్రేయం.

"ఉరుము ఉరిమినది మెరుము మెరిసినది"
కదనుదొక్కే గేయఖండ మిది.
"చెలీ పలుకలేదు నవ్వను లేదు నీవు"
ఊట లూరే తేటగీతి యిది.
ఇంతకూ లెక్కల ప్రకారం చూస్తే చక్కని గీతపద్య మిది.

5. ఇంతగా విస్తరించడం ఎందుకంటే
కృష్ణమూర్తి శబ్దశక్తి కొలమానాల కంద దని చెప్పడానికే.
అతని ఊహాపటిమకు పంజరాలు లేవు.
అతని భాషాప్రయోగాలకు పరిధులు లేవు.

"ఒంటిగాణ్ణయి నిల్చి కాలూనలేను
కడుపులో తల బెట్టెద, గదువబట్టి
బ్రతిమిలాడెద నన్ విడువకు విడువకు
ఏను జీవించలేను జీవించలేను."

ఇది సలక్షణమైన పద్యం.
ఇందులోని భాషమాత్రం విలక్షణం.
'ఒంటిగాణ్ణయి'—ఎత్తుగడలోనే వ్యావహారిక పరిమళం,
'గదువబట్టి'—అసలైన తెలంగాణా మాండలికం.
చుబుకం అనే సంస్కృతపద ముంది.
అదే తెలంగాణంలో 'గదువ' అనబడుతుంది.
అలాగే—'నన్నయ్య తిక్కనాదుల' అనే పద్యంలో
'మనాది' అనేది పునాదికి సరిపోయే పదభిత్తి.
'మనాది'కి ప్రకృతి మనోవ్యాధి,
ఇది తెలంగాణంలో నలిగిన మాటే.

కృష్ణమూర్తి గ్రథనకౌశలంవల్ల
ఈ పదానికి రవ్వల పునాది యేర్పడింది.
అసలు తెలుగు చెప్పినా సంస్కృతం గుప్పినా
ఎంత స్వచ్ఛందంగా చెబుతాడు?
ఎంత స్వచ్ఛంగా చెబుతాడు?
శివుని పరంపర తనది అనడానికి
'చేదున్ మేసినజోదుశిష్యుడ' నంటాడు.
ప్రసన్నేక్షను చూసి తలపోసి
'నాతిహసద్విశాలనయనా' అంటాడు.
పుష్పలావికలు అన్న పాతపదబంధానికి ప్రతిగా
'కాంతిలావికలు' అనే కమనీయ పదసంపుటినే సృష్టించాడు.

6. ఇంతకూ, ఇంతవరకూ నేను
స్పృశించి చూపుతున్నది స్వరూపచిత్రమే.
నేను చూపవద్దనుకున్నది;
సహృదయపాఠకులు స్వయంగా పరిశీలించాలని
నేను కోరుకుంటున్నది
ఈ కవితాసంపుటి స్వభావచిత్రం.
కవికి వాగీశ్వరి ప్రాణేశ్వరిగా, ప్రభుప్రతీకగా
మాతగా, జీవనజ్యోతిగా
అనేక చిదంశలతో భాసించింది.
ఆ చిన్మూర్తియే అనేకాకృతులతో సాక్షాత్కరించింది.
ఆ మహాంధ్ర సరస్వతీ సాక్షాత్కారంవల్ల
కవి అంతరంగ వాటికలో
అకాలవసంతం వికసించింది.
పరవశుడై పాడుకున్నాడు
పదకింకిణులు ఘల్లన ఆడుకున్నాడు.
రసార్ణవంలో మున్కలిడి
దోసిళ్లకొద్ది భావసుధలు తోడుకున్నాడు
"కోట్లతనువుల కౌగిలించితి
"కోట్లగుండెల హత్తుకొంటిని" అంటూ
విశ్వవిహాయసంనుంచి
వేయిగొంతుక లెత్తి చాటుకున్నాడు.
అతని అనంతభావరేఖలూ, ఊహాచిత్రాలూ
రకరకాలరీతుల్లో, గతుల్లో
పద్యాలుగా, గేయాలుగా అవతరించినవి.
అదే సరస్వతీసాక్షాత్కారం.
అదే నవ్యాంధ్రకవితాసరస్వతికి
అనుముల కృష్ణమూర్తి కైసేసిన
అమూల్యాలంకారం.
ఇలాంటి ఉత్తమకృతికి నివాళు లెత్తిన
'యువభారతి' లక్ష్యం ప్రశంసాపాత్రం.

హైదరాబాదు. సి. నారాయణరెడ్డి
26-1-1973

# ప్రస్తావన

పద్యాన్ని అనవద్య శిల్పంగా తీర్చిదిద్దటం ఒక యెత్తు; హృద్యమైన స్వీయకవితా ముద్రతో పలికించటం ఒక యెత్తు. ఈ రెండింటిని సవ్యసాచిలా నడిపించే కవికి ఆంధ్ర సాహిత్యంలో ఆదరమైన స్థానం ఏర్పడుతూ వచ్చింది. శ్రీ అనుముల కృష్ణమూర్తి గారు ఆధునికాంధ్ర సాహిత్యయుగంలో ఎన్నదగిన అట్టి కొద్దిమంది కవుల్లో ఒకరు.

పద్యాన్ని ధారామధురంగా రచించటం తెలుగు కవులలో సర్వసామాన్యంగా కన వడే గుణం. కాని, భావవాహికగా, చిత్తావస్థలను చిత్రించే చలనచిత్రాకృతిగా, ఎదలో నుండి సూటిగా వెల్లుబికే ధారాయంత్రంగా, సహృదయుని మనస్సుకు సద్యఃస్ఫూర్తిగా రసభావాన్ని ప్రత్యక్షీకరించే మోహనమంత్రంగా పద్యాన్ని నడిపే శక్తి ఏ కొద్దిమందికో ఉంటుంది. అట్టి పద్యం నేటికీ తెలుగువారి ఆదరాన్ని చూరగొంటూనే ఉంది.

వచన కవిత్వం ముంచుకొని వస్తున్న యీ శకంలో పద్యకవులపాత్ర ప్రత్యేక మైంది. అవధాన కవిత్వంలోని ప్రసాదమాధుర్యాన్నీ, భావకవిత్వంలోని భావచిత్ర ప్రకటనాన్నీ, ఆధునిక కవిత్వంలోని ప్రతీక సిద్ధాంత ప్రాగల్భ్యాన్నీ, సంతరించుకొన్న పద్యాన్ని వ్రాసే ఒడుపును ప్రదర్శిస్తున్నారు వారు. వారి రచనల్లో పద్యం వింతసోయ గాలు పోతున్నది. అనుభూతినుండి ఆవిష్కరించే పద్యంలో గ్రాంథిక ఛాందసత్వంగాని, వ్యావహారిక బాహుళ్యంగాని లేని యొక క్రొత్త ప్రాతల మేలుకలయికతో నైన శైలి పొటమరిస్తోంది. పద్యగతిలో ఛందో బందోబస్తుల ప్రగాఢబంధం బదులు, ప్రసన్న వాక్శిల్పంలోని పరిమళం గుబాళిస్తోంది. కవి వ్యక్తితో పాటు సాంఘిక ప్రవృత్తి ప్రతి ధ్వనిస్తోంది. పద్యం ప్రేమ భాగవతానికే కాదు విషాదవేదనాచైతన్యానికి ప్రాణం పోయా లని పరితపిస్తోంది. గులాబి గుత్తుల్లా మెత్త మెత్తని పదాల పోహళింపుతో పద్యం మెత్తబడి వత్తై పోకుండా వేడివేడి మాటలతో పద్యం కవోష్ణరుధిరంలా పొంగాలని ఉత్సహిస్తోంది. ఇట్టి కవితా చైతన్యానికి బావుటాలాగా శ్రీ అనుముల కృష్ణమూర్తి పద్యకవిత్వం పరవళ్లు తొక్కుతుంది.

'వెధవ గులాబి గుత్తుల కవిత్వము నెన్నడు సన్యసింతురో  
వ్యథ యన నప్పు డర్థమయి వాక్కునకున్ పదు నబ్బునంచు నా  
కథమము లక్షసార్లయిన ఆత్మకు తట్టెనుగాని ఎన్న దే  
విధమున నుద్యమింతు నని వేచితి నింతయు పెద్దకాలమున్.'

అన్న అంతర్వేదన కవిలో క్రొత్త గళాన్ని శంఖంలా పూరించింది. క్రొత్త వాగ్ఝరి వాకలు వాకలుగా పొంగులు వారింది. ఈ నవ్యకవితావేశమే కృష్ణమూర్తి గారికి సరస్వతీ సాక్షాత్కారమై కావ్యరూపం సంతరించుకొన్నది.

'సరస్వతీ సాక్షాత్కారం'లో కథ లేదు. కవితారూపంగా జాలువారిన వ్యథ కనపడుతుంది. మధురవేదనలోనుండి సుధామయ భావలహరి రమణీయ వాగ్విలాసాలతో లాస్యం చేస్తుంది. పద్యంలో ప్రధానంగా పదాలు వేసినా, గేయంలో, విరళచ్ఛందంలో కవిత విలాసంగా నడకలు నడుస్తుంది. బాధను వ్యక్తం చేస్తూనే పాకంలో సుధలను వర్షిస్తుంది.

ఇది ఖండకావ్య సంపుటి. ముక్తకాలుగా ముచ్చటైన ఛందాలు కవి భావస్రవంతికి పుణ్యతీర్థాలుగా ఘట్టాలు నిర్మించుకుంటాయి. కవి మనోప్రపంచంలో పరవళ్లు తొక్కే కవితావేశం కరళ్లు కరళ్లుగా లేచి ఖండకావ్యాలుగా రూపొంది నిలిచాయి. ఒక్కొక్క ఛందం ఒక్కొక్క రసతరంగం. వాని వెనకాల జీవునివేదనలా వినిపించే హోరు. ఆ హోరులో భగభగా మండే భావబడబానలం. మనోభావాల బలమైన ప్రేరణకు భావచిత్రాలుగా పొంగిన పద్యరత్నాలు ఈ కావ్యంలో కనపడే కమనీయ ఛందోవిన్యాసాలు.

అందుకనే 'సరస్వతీ సాక్షాత్కారం' కవితాసృష్టిలో కవిమనఃప్రవృత్తి పొందే మానసికపరిణామాల కెత్తిన ప్రతీకాత్మకకావ్యం; ఒక సైకలాజికల్ పోయెం.

కవితా స్వరూప సాక్షాత్కారంలో కవి అధిగమించే మానసికావస్థలను పాశ్చాత్య విమర్శకులు నాలుగువిధాలుగా భావించారు.1. Preparation (ప్రయత్నం)2. Incubation (ప్రరోచనం); 3. Illumination (ప్రకాశనం, లేక అలంకరణం). 4. Varification (పరిశీలనం). కవివాక్కు సరస్వతికి ప్రతీక అయితే తత్సాక్షాత్కారానికి దోహదమయ్యే కవిమానసికావస్థలు పూర్వరంగాలుగా పొందుపడతాయి. ఆ మానసికావస్థలను కవితగా చిత్రించటం సామాన్యుడు చేసేపనికాదు. ఈ కవి ఆపని చేసి చూపించాడు. అనుభవంలోని అణువణువును అంతర్దృష్టితో అవలోకించి ఆత్మానుభూతిని అక్షరబద్ధం చేసే గాఢశీలం, ప్రతిభాప్రాభవం శ్రీ కృష్ణమూర్తి గారిలో పుష్కలంగా కనపడుతున్నాయి. కవితా సృష్టి కున్ముఖమైన మానసికావస్థలకు రూపకల్పనం చేసి గుణాధానం చేసి పఠితచిత్తానికి భారతీప్రాభవాన్ని ప్రత్యక్షం చేసే విశిష్టనిర్మాణశిల్పమే ఈ ఖండకావ్య తత్త్వం.

ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసాలు కావ్యహేతువులు. ప్రతిభ పౌరుషమైన మానసికశక్తి, వ్యుత్పత్తి స్త్రైణమైన మానసికశక్తి. ప్రతిభావంతుడైన కవి స్త్రైణమైన వాగ్వ్యుత్పత్తి నన్వేషించి వశం చేసుకుంటాడు. పురుషుని తేజం స్త్రీని ఆశ్రయించి రూపం తాల్చినట్లే పౌరుషమైన ప్రతిభ స్త్రైణమైన వ్యుత్పత్తి నాశ్రయించి కవితారూపాన్ని పొందుతుంది. భావానికి ఆకృతి ఆలంబనం భావరూపమైన కవిప్రతిభ రూపావతారావస్థను సంగ్రహించే ఆంతర చైతన్యవిశేషమే ప్రయత్నావస్థ.

"నా కవితా సరస్వతికి నాలుక లేదొక గుండె దక్క; మే
లౌ కనుచూపు లేదలుక లావగు నవ్వు దక్క; తాను తా
నై కదలంగ లే దొకరి యానర వెంబడి దక్క; ఇంక ఏ
సాకును చూపి తాను మనజాలునొ నల్వురి నోటిముత్యమై."

కవితా సరస్వతిగా కవిప్రతిభకు రూపాధానం చేసే యత్నంలో ప్రయత్నావస్థను అద్భుతంగా సాధించారు కృష్ణమూర్తిగారు.

ఆకృతి కల్పనలో అంగవిన్యాస సృష్టి చైతన్యం ప్రరోచనావస్థలో ప్రత్యక్ష మౌతుంది.

"స్వరమైత్రిం బడి సాగి వచ్చెడి మనోజ్ఞమ్మైన నాదమ్ము చె
చ్చెర రాగాకృతి దాల్చి నట్టుల వచస్సీమంతినీ! నీ హృదం
తర సౌభాగ్యమె భావనన్ బడి రసానందస్థిరమ్మైన య
క్షరరమ్యాకృతి దాల్చి వేద మగు శాస్త్ర మ్మౌను కావ్య మ్మగున్."

అన్న కృష్ణమూర్తిగారి వాక్కులో కవితాసరస్వతి అక్షరరమ్యాకృతు లైన కావ్య ప్రక్రియలను సాధించే చైతన్యాన్ని పొందింది.

ప్రరోచనంలో కుట్మలావస్థలో నున్న కవితావిష్కరణ చైతన్యం ప్రకాశావస్థలో కవి వ్యక్తిత్వ ముద్రతో స్వతంత్రతా సామర్థ్యాని భజిస్తుంది. కవితాహంకారం కళాత్మకంగా ప్రకటమయ్యే అవస్థ యిది.

"నన్నయనుండి నావర కనర్ఘళ మైన రసస్రవంతి సం
పన్న మొనర్చిరే తెనుగుబాసను వారిని సంస్మరించి యా
పన్నవభారతోర్వి గల బాసల గౌరవ మూహ చేసి నా
కున్న కవిత్వపుం జొరవ నూతగ వ్రాతు మహాకవిత్వమున్."

పరిశీలనంలో కవి కవిత్వాహంకారంకన్న కళావిష్కారము కనపడుతుంది. ఆత్మానుభూతినుండి ఆవిష్కృతమైన భావాన్ని నెమరు వేసుకున్నప్పుడు కవియే కవితకు శ్రోతగా మారుతాడు. ఆత్మాభినివేశం బదులు ఆత్మార్పణం కనపడుతుంది ఈ అవస్థలో.

"ఏది యైనం రచియింప బూనెదను తా నే భావమో రాక మా
న దటంచున్ పదజాలమున్ వెదకుదున్ నానాచమత్కారసం
పద గూర్తున్ పదిపద్యముల్ వరుసగా వ్రాతున్ మరావెన్క చూ
చెదనా అన్నియు నుండి నుండ దొకటే శ్రీమెట్టురామేశ్వరా!"

ఈ కావ్యం చదివేటప్పుడు కవిలో కవితాసరస్వతీసాక్షాత్కారం కలుగుతున్న ఘట్టాలు కన్నులకు కటతాయి. పఠితకు రసభారతీ సాక్షాత్కారం అవుతుంది.

పౌరుషమైన ప్రతిభ స్త్రైణమైన వ్యుత్పత్తి నాశ్రయించినప్పుడు పురుషుడు స్త్రీని ప్రేయసిగా, మాతృమూర్తిగా, సృష్టిక్రియా మూర్తిగా ఉపాసించే ఛాయలు కనపడతాయి కవి ప్రవృత్తినిబట్టి అది శృంగారంగా, వత్సలంగా, భక్తిగా రూపొందుతుంది. ప్రకృతి రూపిణియైన స్త్రీ పురుష చైతన్యానికి రూపకల్పనం చేసి యిస్తుంది. ఆ రూపంలో పురుషుడు తన రూపం తాను చూచుకొని మురిసిపోతాడు. కవితాచైతన్యంలో ఇది చిత్రవిచిత్రమైన అవస్థలుగా ఆవిష్కరింపబడుతుంది.

శ్రీ అనుముల కృష్ణమూర్తిగారి ఖండకావ్య సంపుటిని క్రమంగా చదువుకుంటూపోతే అంతస్సరస్వతీ సాక్షాత్కారం కలుగుతుంది. తర్వాత రసవసంతం భావనాజగత్తులో

వెల్లివిరిస్తుంది. ప్రకృతిధర్మమైన కామనం పొటమరిస్తుంది. 'నా మనసాయెనే' లో కవితా కామన కనపడుతుంది.

"నా మనసాయెనే! ఎదవునాదులలోని అనాది వాసనల్
మామక సర్వభావగత మార్దవ మంతట నావరించి నీ
ఏ మరియాదలై బ్రతుకు నింతటి కమ్మదనాన తేల్చె నా
యా మరియాద లీపదములం దపురూపపు తీవి నూరగన్"

ఎదపునామలలోని వాసనామయ జగత్తు నన్వేషించే కవికి శివరూపమైన పరమార్థం ప్రత్యక్షమౌతుంది. దానికి భౌతికరూపం 'మెట్టు రామేశ్వరుడు' కావచ్చు 'జగత్పరమేశ్వరుడు' కావచ్చు. కవి అప్పుడు రసానంద సంధానచిత్తుడై పరమాత్మను తనలో దర్శించు ద్రష్ట అన్నది సత్యం.

ప్రకృతినుండి పరమేశ్వరతత్త్వం వరకూ పరివ్యాప్తమైన కవి కవితాచిత్తప్రవృత్తిలో కనవచ్చే సోపానక్రమం ఈ కావ్యఖండికా సంవిధాన శిల్పం.

పద్యంలో నైనా గద్యంలో నైనా కవితాత్మను దర్శించే 'యువభారతి' ఈ 'సరస్వతీ సాక్షాత్కారాన్ని' ప్రకటించటం అభినందనీయం! యువతరానికి ఇట్టి సాహిత్య సహనశీలం అవసరం!

—జి.వి. సుబ్రహ్మణ్యం



# రచయిత పరిచయం

వరంగల్ మండలములో, సాహితీలతకు అలవాలమయిన మడికొండలో, శేముషీసంపన్నమైన అనుముల వంశములో జననము. బాల్యంలోనే వైదికవాఙ్మయమును, గీర్వాణభాషారీతులను, అధ్యయనం చేసినవారు. ఆంధ్ర, ఆంగ్ల, ఉర్దూ, హిందీ సారస్వతములందు అభినివేశము కలవారు. ముక్తాముక్త ఛందఃఫణితులలో, సమానప్రతిభతో కావ్యరచన చేసే సామర్థ్యాన్ని గడించుకున్న లేఖిని వీరిది. సంప్రదాయములపట్ల, సునిశితమైన అభిప్రాయములు. రసం ప్రాణం కంటే ఎక్కువని ఆయన ప్రగాఢ విశ్వాసం. తనతరంలోనే ముందుతరాల ప్రగతికి తేజస్సునూ, జీవాన్ని, ప్రసాదించే చైతన్యం ఉందని వీరి నమ్మకం. ప్రస్తుతము, వరంగల్ జిల్లా లోని పర్కాల్ లో ప్రభుత్వజూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ గా ఉన్నారు.

# అంకితం

తాను రసచక్షువును ప్రసాదించినట్లు

నా సతి నరసమాంబా,

తాను రసహృదయం ప్రసాదించినట్లు

మా పెద్దన్న కాళోజీ రామేశ్వరరావూ,

ఈక్షణంవర కెరుగరు.

ఐనా, వారి యానగా,

నేను, ఈ కృతిని

వీధిబడినుండి విశ్వవిద్యాలయంవరకూ,

మెరుస్తూ, నన్ననవతరం ఉత్తేజితుణ్ణి చేస్తూన్న,

అనంతకోట్లనేత్రాల నా యువభారతికి,

నీరాజనంగా అర్పిస్తున్నాను.

# అంజలి

ఇది పలుకు పలుకుగా
ఎద తేనియల మాగుటకు
నిమిత్తు డైన ఆత్మీయుడు,
మా వెలిదె నృసింహామూర్తికీ,

రసావిష్టుడ నై నపుడెల్ల,
ఓపికతో, మక్కువతో
వ్రాస్తూ, పదిలపరుస్తూ వచ్చిన,
రసహృదయు డైన మా రామశాస్త్రికీ,

"అయాచితం" గా ఆహ్వానించి,
అచ్చొత్తించి, మిమ్ముల రంజింప జేసే
అవకాశ మిచ్చిన, ఈ
యువభారతికీ........

**అనుముల కృష్ణమూర్తి**

# స్వయం సమీక్ష

[ప్రథమ ముద్రణ పీఠిక]

ఇందులో స్వోత్కర్ష లేదు. మనవీ, వేడుకోలూ అంతకంటె లేవు. రచనలో యత్నింపబడిన ఒక ప్రక్రియను వివరించుట మాత్రమే దీనిలక్ష్యము. బాగోగుల తెలిపెడి భారము విమర్శకుల దైనట్లే. హర్షించగల భారము పాఠకులదే యైననూ, కవి తనకృతికి తానే ప్రథమపాఠకు డనుట వాస్తవము.

గేయ భాగములలోగాని, వృత్తములలోగానీ అనుకరణమును స్పర్శకైనను రానీయలేదు.

"ఆరయ నిర్వరే యిరువు
రాధునికాంధ్రవచస్సరస్వతీ
హారమణుల్, జనప్రియమ
హాకవివాచ్యులు
............
వారలె వుస్తె గట్టిరా?"

అను పద్యమునకు తార్కాణముగా రచింపబడినది. ప్రథితములైన వ్యాకరణచ్ఛందో నియమములలో విశేషస్ఫూర్తి ప్రయోజనముల నర్థించియే, మార్పులు జరిగినవి.

ఒక అర్ధరాత్రి అకస్మాత్తుగా మనశ్చక్షువునకు గోచరించిన చీరంచు, స్త్రీయాకృతిగ రూపొంది, కన్నులనుండి కాళ్లవరకు కరుణామయియైన వాగ్దేవతాకృతిగ భాసించినది. అది సర్వరసాత్మికయై మహాంధ్రజనని యైనది.

వృత్తభాగమున రసాధిదేవతాదర్శనమునకై హృదయము ఉద్విగ్నమైనది. రసస్థానముల నన్వేషించుటయు, దర్శించుటయు, ప్రస్తమగుటయు జరిగినవి. ఆశ మాత్రము వీడక నిరంతరాన్వేషణోద్యతమైనది.

రచనలో ఒక వృత్తమున కింకొక వృత్తము అనుబంధ మైనట్లు తోచినను, ఏపద్యమున కాపద్యమే "ముక్తము" గా గ్రహించవచ్చును. ప్రియునివలె, తనయునివలె సమన్వయించుకొనవచ్చును. ఉర్దూ భాషలో "గజల్సు" ఉన్నవి. అవి ముక్తకములు. కానీ, వాని కొక సౌకర్య ముండుటవలన రచనలో సౌలభ్యమూ గ్రహణలో అనుకూల్యత

ఏర్పడుచున్నవి. వారికి, ప్రియురాలూ (మాఘూకా), భగవంతుడూ పుంలింగములే. అందువలన ప్రతి ముక్తకమున స్ఫూర్తిద్వయ మేర్పడి పాఠకునికి ఏకకాలమున భూనభో భూమికలు అనుభూతిదశ లోనికి వచ్చుచున్నవి. మన కాసౌకర్యము లేదు. కావున, ప్రియురాలిగనో, లేక శృంగారాదుల విసర్జించి మాతృమూర్తిగనో, లేక ఇంకనూ పావిత్ర్యోదాత్తత నమకూర్చి పరమేశ్వరిగనో భావించుట జరుగును.

"రావే ఈశ్వర! కావవే వరద" అని ఆర్తినీ, ఆర్ద్రతనూ స్ఫురింపజేయవచ్చును. కానీ, స్ఫూర్తిద్వయ మనోరంజకత్వమును సిద్ధింపజేయ లేమేమో!

భావపరిధులూ, ఆలోచనాపరిధులూ, కల్పనాపరిధులూ మనతరంలో మరీ విశాలములైనట్లు, రసప్రపంచపరిధులూ విశాలములైనవి. మనస్సులకు వాసలోనికి విహరించ గలపుష్టి చేకూరినప్పుడు అని కేవలకళాత్మకములే కానవసరములేదు. వైజ్ఞానిక, ఆర్థిక, తాత్త్విక వ్యాపార రంగములలోనూ ఉద్యోగింపవచ్చును గదా! ఆ పుష్టినీ, ప్రేరణనూ, స్థైర్యమునూ కావ్యముల ద్వారా సైతమందింప వచ్చునేమో!.

# ఆత్మీయం

[ద్వితీయ ముద్రణ పీఠిక]

ఈ 'సరస్వతి' మా 'యువభారతి'కి తొలిముద్రణ కావడమూ, అది రెండవ ముద్రణకు నోచుకోవడమూ చూస్తే నన్ను నిజంగా ఒక నమ్రత ఆవహిస్తూ ఉన్నది. ఎందుకంటే ఇందులోని ఏ కొంచెం శిల్పానికో, చమత్కారానికో కారకుణ్ణైతే కొంతవరకు కావచ్చునుకాని రససృష్టికి మాత్రం కారకుణ్ణి కానేమో అనే అనుమానం నాలో నానాటికీ బలీయమౌతూ రసమన్నది కేవలం స్వయంభువు అనేదే ఋజు వవుతూ ఉన్నది. అందువల్లే అది స్వయంభు వనీ ఒక్కొక్కని అదృష్టంబట్టి వాని 'ద్వారా' ప్రత్యక్షమైతే కావచ్చును. కాని వాడు సృష్టిస్తేనే వచ్చేదిమాత్రం కాదనేది వాస్తవం. దీనికి దూరందాకా ఎందుకు? నన్నే ఉదాహరణంగా తీసుకుందాం.

నాకూ కొన్ని భాషలతో పరిచయం ఉంది. వానిలోని కవిత్వాన్నీ, రసాన్నీ ఆనందించే యోగ్యతా ఉన్నది. అయినా మన తెలుగు నుడికారాన్నే, పలుకు పలుకునే ఎందుకు సరస్వతిగా దర్శిస్తున్నాను? మమకారమా? ఏమో!

తను వాపాదశిర మ్మది  
అనవద్యవినూత్న గీతికాకృతి ఇంతల్  
కను లంత్యప్రాసలుగాన్  
కనరే నా తెనుగుబాలికన్ మనసైనన్.

ఈ గీతికాకృతి నాల్గుకోట్ల కంఠాలు మాట్లాడే ఒక్కొక్క తెనుగు మాటలో దర్శనం ఇస్తూ ఉన్నదే! ఎంత కమ్మనిభాషకు మనం నోచుకున్నామో! అది తన నుచ్చరించే జాతికి ఎంత మెత్తందనాన్ని, నాగరికతనీ ప్రసాదించిందో! అందులోని వినరంత నేనూ నోచుకున్నానని ఎప్పుడూ మురుస్తూ ఉంటాను.

భావుకుడైన సహృదయుడు కవికంటె కొన్ని రెట్లెక్కువగా రసానుభూతిని పొందడం మనందరికీ అనుభవంలోని విషయమే.

పదపదార్థస్ఫూర్తి పలువిధాల  
నోచుకొనువారి కొలది ఈ నుడులలోన  
రసపదర్థమ్ము లక్షతీ ర్లగును భావ  
నల బలముబట్టి తేటమనస్సుబట్టి.

అదనంగా "నా మనసాయెనే" "శివమెత్తించకు" అనే శీర్షికలు ఈ ప్రచురణలో అందించినాము. సరస్వతీ సాక్షాత్కృతికి హేతువైన రసోద్దీపనం ఈ పద్యాల్లోనూ భాసించిం దనుకుంటాను. నా ఆలోచనలకు జీవంపోసే సంస్కారవాసన ఈ పద్యాల్లోనూ ఉంది. రసికు లీకావ్యఖండికలలోని కవితాకాంతినీ తిలకిస్తా రని, ఆనందిస్తా రనీ ఆకాంక్ష.

వాస్తవానికి మన భాషలో గణబద్ధం కాని మాటే లేదు. గణాల్ని తారుమారు చేసే పొట్టి పొడుగూ పాదాలక్రింద తమ రచనల్ని విడగొట్టి కొందరు మిత్రులు వచనగేయ మనీ వచనకవిత అనీ అంటున్నారేమో నని నా అనుమానం. సంస్కృతంలోని 26 ఛందా ల్లో సుమారు కోటిన్నర వృత్తసంఖ్య ఉన్నదట. వారి రచనలు మనకు చలామణిలో ఉన్న ఏడెనిమిది వృత్తాల్లో ఒదుగకపోవచ్చుకాని ఆ కోటిన్నర వృత్తాల్లో దేనికో ఒక దానికి ఒదుగవచ్చు. దానికి పేరూ ఉండవచ్చు. కాని, ఎవరూ అంతదూరశ్రమ చేయ లేదు. పై కారణాలవల్ల ఆధునిక రచనల్ని ఛందోరహితం అనడానికంటె "గంప గుత్త"గా సామాజికచ్ఛందం అంటే బాగుంటుందేమో!

ఈ రెండవ ముద్రణంలో అదనంగా రెండు శీర్షికలను చేర్చడానికి దేశంలో ఇంకా పద్యరసికులు ఉన్నారనే బలీయమైన నా విశ్వాసం తప్ప మరేదీకాదు ఇంకొక చిన్న కారణమూ ఉన్నది.

వచన కవితా రచనాన్ని తన వేలాది ప్రయోగాలతో ఇంత పరిణతికి ఎదిగించిన వాడు ఒక్కడే ఒక్కడు మహాశిల్పి ఆరుద్ర. పద్యశిల్పంలో విశ్వనాథా అంతే. ఆయన తర్వాతే అందరూ. ఐనా ఆరుద్ర అందరికీ తెలిసేట్టు చేయడంవల్ల వచనకవిత వర్ధిల్లింది ఈయన తెలియబడకుండ చేయడంవల్ల పద్యభాగం సన్నగిల్లింది. అందువల్ల పద్యశిల్పంలో యథాశక్తి ప్రయోగాల్ని జరిపితే హర్షించేవా రుండకపోరనే ఒక నన్నని ఆనకూడా నన్ను పురికొల్పిందేమో అని అప్పుడప్పు డనుకుంటూ ఉంటాను.

ఇందులోని కొన్ని పద్యాల్ని చదివేటప్పుడు మానసిక చిత్రనిర్మాణానికి (Image Construction) అనుకూలమైన ఏకాంతమూ, మొగ్గూ (Attitude) ఉంటే మరీ హర్షి స్తారేమో అని సవినయంగా మనవిచేస్తూ...

మీ

అనుముల కృష్ణమూర్తి

# సరస్వతీ సాక్షాత్కారము

ఓ మహాంధ్ర సరస్వతీ !
మామకీన కావ్య సంస్కారపుణ్యాకృతీ !
వ్యధల బొగులని మనసు నీయంగదే,
కొంగుచివరి ముడిని పట్టంగనిచ్చి
నన్ విడువవుగదె ?

ఆణిముత్యాల చిరుపేటికా !
పలుకుము !
అందచందాల ఓ మల్లికా !
కులుకుము !
ఓమహద్దివ్యసౌందర్యభూమికా
నభస్స్ఫురచ్చలత్ తటిత్ క్షణప్రభా !
వెలుగుము !

ఈ వుపాస్యవు సర్వసాహిత్య మస్మ
దీయము భవదుపాత్తము దేవి ! వీ డ
నంతవాఙ్మయాంబుధిని రవంత అమృత
మును మధించి మురియు కవిబ్రువుడు సుమ్మి!

అరమూసిన చెలికన్నుల
విరబూచిన తొలివెన్నెల
వలపుచలువలల నల్లన
తొలకరి కెద ఝులుఝుల్లన
చిరుచెందురు నెన్నుదురున
కెరలు కురులు నలనల్లన
నునుగోళుల మేళవించు
రసవీణియ మెలమెల్లన
పెదవులపై చిరునవ్వులు
తెలవారగ భళుభళ్లున
ఘులుఘుల్లున దిగు రాణీ !
చిలికి పొమ్ము పారాణీ !

మలసి చందనగిరుల
చెలువ నాగులసిగల
పొరలు చిరుగాలి తర
గలు ఊయ లూగంగ
తరణికిరణముల క్రొం
దెరలలో వన్నె లే
దును గగనమార్గాన
మణితోరణాల్ గాగ
చిరుమీలు పొంగుతర
గల శీకరములందు
ప్రతిఫలించిన జలధి
పరవళ్లు ద్రొక్కంగ
అవతరింపవె ఆత్మరాణీ !
అమృత కుంభోత్ఫుల్ల పాణీ !

లేయుల్లి పొరనార
అల్లినేసిన మేలి
వలిపంపుహొంబట్టు
చెంగావిచీరంచు
పాలరాసానపై
యరిగి మెరుగులు జిల్కు
అపరంజిశంఖమ్ము
వంటి మెడవంపుపై
మెరపుతీవియవోలె
గిరినాగు దిగురీతి
ఆయంచు నడయాడ-
మాయమాయపు నీలి
మడతలా చలిరేకు
తొలిమంచు పొరలోని
రజితంపు కైలాస
గిరిజంట శిఖరాల వంటి చన్గట్టుపై
తెలివితేటల మించు
సరిహద్దు రేకగా
ఆయంచు నడయాడ-
పాలకడలికి చిన్ని
ప్రాకారమన సన్న
నెన్నడుము బంగారు
తమ్మిపూతిన్నెపై
కమ్మతావిని పేని
కండెబోసినరీతి
ఆయంచు నడయాడ-
లేయరటి లేయంటు
జంటబోదెలలోన
లేలేత పచ్చన్ని

ప్రాణమెత్త తా మొల్చి
యెదిగి కదలాడెనో
చేవలన్ బెంచెనో
మిసిమిసిమి మెత్తన్ని
పసిడి పుప్పొడి చంద
నమ్మందు కలువాన
రంగరించిరో సొగసు
వగలన్ని నిగనిగల్ జిలుకగా
నడకలో వలపు టొ
య్యారముల్ గులుకగా
చెరుకుపాలను ముదురు
మీగడల్ పొరలించి
నునులేత పాకాన
దించి కోలలు చేసి
కంబాల నిలవెట్టి
రో-అనగ ఊరువుల
తిన్నె తిన్నెల సన్న
వెన్నెలలపాయగా
ఆయంచు నడయాడ-
క్రిందికిన్ కాలియం
దియల చుట్టును ముట్టి
నిలచినన్ సురగంగ
సనసన్న నౌ పాయ
నందనమ్మందు హరి
చందనమ్మున తేమ
లారనట్టుల కుదురు
గా నీటుగా నిల్చి
చిరుగాలికిన్ చిన్ని
తరగలను పారిజా

తపు తేటపరిమళము
సురలోకములు నిండ
అలలవలె కదలాడు
కలల వలె తూగాడు
కుచ్చెళ్ళతో రమ్మ రాణీ !
నా నాల్కపై యాడు వాణీ !

సుతిమెత్త చిగురాకు
ఒగరు తీపిని మించి
ముదురు మోదుగు మొగ్గ
పాలతేనియ మించి
విరజాజి నడిబొడ్డు
లో కొల్వులన్ దీర్చి
కుదురుగా నెత్తావి
నెమరు వేయుచు కులుకు
కోదమ తేటికి గాన
మాధురీరుచి నింప
చెవి కింపు విన సొంపు
గా- షడ్జగాంధార
పంచమస్థాయిలో
రాగాల నాలపిం
చెడి మత్త భృంగాళి
చిరు పిసరు కెంపూస
మురిపెంపు గొంతులన్
సొంపులన్నియు నింపు
కొనివచ్చు ఓంకార
నాదంపు సొగసంత
నా వీనులన్ గుండెలన్
నిండగా రాగదే !

ఓ ఆదినాద మాహేశ్వరీ!
రసకళారాజీవరాజేశ్వరీ!
ఎన్ని జన్మల పున్నెమో మరి
ఎంత పున్నెపు తపసులో మరి
ఎన్ని తపసుల వరములో మరి
ఎన్ని వరముల పంటలో మరి
ఎన్ని పంటల ఫలములో మరి
నే కంటినే రాణి!
నే వింటినే వాణి!

ముగుద తామరమొగ్గ
సిగ్గుతో ఒడలంత
ముడుచుకొని ముడుచుకొని
పరువమ్ము పొంగేటి
వయసంత బిడియాన
దాచుకొని దాచుకొని
తూర్పు ప్రహరీ నెక్కి
తొంగిచూచెడి ప్రియుని
పెదవి కదుపక పిలుచు
మూగబాసలలోన
నే వింటినే నిన్ను
నే కంటినే నన్ను.

ఊరంత వెన్నెదుర
ఒదిగియుండెడు వేళ
మైమరచి మత్తులో
సృష్టి యుండెడు వేళ
తానొక్కతియు లేచి

జగముపై దయదలిచి
ఎలుగెత్తి పిలిచేటి
తొలిపుంజు జీరవో
వని ధీరకంఠాన
నే వింటినే నిన్ను
నే కంటినే నన్ను.

లెండహో లెండు తొలి
సంజ వెలుగులు బ్రామె
ప్రాగ్దిశాంగణ బాల
భారతీఫాలాన
లెండహో లెండు బ్రా
హ్మీముహూర్తస్వాదు
వైదికాధ్యయన జా
గృతిశీలమై జాతి
అభ్యుదయ మార్గాన
నుద్బుద్ధమై వెలుగ
వీధివీధుల దిరుగు
ఘనోర్ధ్వపుండ్రశో
భాప్రాంశుగాత్రులా
ప్రాభాత వైతాళి
కోద్గాతృకంఠాల
నే వింటిదే నిన్ను
నే కంటినే నన్ను.

కసికొలది బల్మి గుం
జకు లాగి కట్టంగ
పసిలేగ పాల కం

జా యంచు అర్వంగ
తనచనులచేపు పా
లవి పొంగి నిండేటి
మొరకైన మోకాళ్ల
నడిమి గిన్నెలలోకి
తిలకించు గోమాత
జాలికన్నులలోన
నే కంటినే నిన్ను
నే వింటినే నన్ను.

తనప్రక్క మొక్క పా
దును నిండుగా దడిపి
తన వ్రేళ్ళ పెకలించు
మొరటు పిడికిలి చూచి
గజగజా లాడేటి
కలమందకాడలో
గిజగిజా లాడేటి
దాని దొడ్డాకులో
నే కంటినే నన్ను
నే వింటినే నిన్ను.

తమకోర్కెలో నుండి
తమవలపులో పండి
తమచిన్నరూపమై
తమయింటిదీపమై
తమకలలు సత్యమై
తమయునికి నిత్యమై
తమకంటిముత్యమై

తమదారిబత్తైమై
చంకసింగారమై
కొంగుబంగారమై
కనులకెందామరై
ఎదకు వింజామరై
ఒడిలోని పెనుబంతి
పూవంతమోములో
పగడాలవలె వెలుగు
చిరుమేను చిన్నారి
చిరుమీనుకన్నాల
కిలకిలా నవ్వేటి
చిరుబోసినోటిలో
ప్రాణమ్ములన్ బెట్టి
జోపాట పాడేటి
అమృతమ్ముకంటె
కమ్మనియమ్మకంఠాన
గంధమ్ముకంటె
చల్లనితల్లి పాటలో
నే వింటినే నిన్ను
నే కంటినే నన్ను.

పసిడితామరకాడ
పరువంపుకరముతో
కలశాన పొంగు పా
లను ఆరగింపంగ
పసిడితామరమొగ్గ
పరువంపు తనువుతో
నిలువెల్ల పూలవా
సన గుబాళింపంగ

పసిడితామరపూవు
పరువంపుగుండెతో
ఎదలోన పొంగు కో
ర్కెలు నివాళింపంగ
తనువెల్ల నిలువుదో
పిడికోస మని తెచ్చి
తొలిరేయి తలుపుదా
పున నిల్చి తలవంచి
గోముగా కాలిగో
టను నేలపై రాయు
వలపుపత్రాల కీ
భూదేవియే సాక్షి
యని నిలుచు మైతీవ
బరువు నిట్టూర్పులో
ఆ మొదటికూర్పులో
తొలిసోగ మోములో
చెలిమూగనోములో
నే కంటినే నిన్ను
నే వింటినే నన్ను.

ఇది స్వప్నగీతమై
ఎదవీణియల మ్రోగె
ఇది పలుకు పలుకుగా
ఎదతేనియల మాగె
ఓయమ్మ! మాత్రిలిం
గోర్వీవచస్సస్య
కేదారరసలక్ష్మి!
చూచితే చిత్రమ్మ?
నీ కృపాలేశదృ

జీర్ణరాంజనచ్ఛాయ
ఒకమొక్క మొలచి ఊ
రక మురియుచున్నదే!
ఒకమొగ్గ తొడిగి నీ
ఒడి నుంచుచున్నదే!

ముక్కోటి కుట్మల
ముల్మల జీవబిందువుల
చిలికి చిరునగవు విరు
లొలకబోసెడి నిండు
అమృతకుంభము కుంకు
మారుణకరాంజలిన్
బూనివచ్చెడిదాన!
మందహాసీయాన!
మాయమ్మ, నీయాన!

ఇది స్వప్నగీతమై
ఎదవీణియల మ్రోగె
ఇది పలుకుపలుకుగా
ఎదతేనియల మాగె.

చల్లనిగాడ్పు వర్షపుతు
షారము తెల్లనిమల్లెపూలు న
న్నొల్లనినిన్నునైత మొక
టూపుడు నూపిన ఆనిశీధి నీ
నల్లని రెండుకల్వలకొ
నల్ వెలిగించినక్రొత్తకాంతి నా
యుల్లము నిండి తబ్బిబుగ
నూపిరి సల్పగనీదు నెచ్చెలీ !

జన్మజన్మల ముం దొక్క జన్మమందు
రెండునీడలు వేరుగా లేవు మనకు
ముందుజన్మల మరల ఆ మునుపటట్టు
లొక్కడే నీడయౌ యోగ మున్నదేమొ !

ఒక్క చిరునవ్వు కోసమై ఉగ్గబట్టి
ఒక్క కడకంటిచూపుకై యూపిరాగి
ఒక్క చక్కిలిగింతకై ఉన్నదంత
ముడుపుగట్టితిగాదె నీ యడుగులందు.

నాడు వనాన, సాంధ్యగగ
నాన నినున్ గనినప్పుడే పొరల్
వీడిన వీకనుంగవల ;
వేలవసంతము లొక్కమారు వె
న్నాడగ ఓపలేని కుసు
మాంగన వెచ్చగ విచ్చినట్టి మా
ధాడని ఎఱ్ఱనౌ పెదవు
లానినవారె స్ఫురింప నెల్లెడన్.

ఎందరి నోళ్ళలో బడితి
వే చెలి ! ఇందరి నేల గల్గు నీ
అందపుతప్పుగాని మన
సారగ నీవు వరించలేవు ; రా
కేందుసహస్రచందనము
ఖీ ! ఎద నిచ్చిన నే నెరుంగుదున్
కుందని నీ ఎడంద ఎరు
గున్ దెలియంగలవారలే రిలన్ ?

వచ్చెడిదాక ఏడ్పు మరి
వచ్చినపిమ్మట ఇన్నినాళ్ళు లీ
వెచ్చట దాగితంచు ఒక
డే "గజసాధన", చేరవచ్చి తా
మచ్చిక నింత జూప, అణు
మాత్రము నోపగలేక, "నిల్చెదే
గ్రుచ్చి కవుంగలింప" వను
గోల, కవిత్వమునందె సాధ్యమౌ.

తా నణుమాత్రమేని కవి
తారసగాంగజలాశయాన కా
లూని ఎరుంగనట్టి ఎవ
డో, కడుచౌకచమత్కృతుల్ కవి
త్వానకు దించినట్లయి సె
బా సనిపించుకొనున్ భవత్కృపన్
ఈసడుమంతరంపుసిరి
యేనియు నన్ను వరింప నొల్లదే !

వేవిధముల్ పొగడ్తలు క
        విత్వములో మరి లక్షతీర్లు, నీ
వై వరియించు పద్యముల
        నల్లుదురే సఖి ! వ్రాసివ్రాసి నీ
లావు మిగల్చరే సొగసు
        లాడి ! వయస్సిది సళ్లు, కోర్కెలో
చేవ లడంగు నీకరకు
        చిత్తము నాపయివ్రాలునంతకున్.

ఒక్కని కంటిలోన మరి
        యొక్కని చల్లనిమాటలోన ఇం
కొక్కని గుండెలోన ఇటు
        లొక్కొకచోట నాకొక్క తీరుగా
నక్కిన నిన్ను గాంతు చిరు
        నవ్వుల నన్నును కాంచుచుంటి వీ
లెక్కడ నున్న దాన విపు
        డే పసిగుండెలలో మరుంగున్.

అన్నివిధాల నాసఖుల
        నారట బెట్టిన నీమెరుంగు క
న్నన్నల నేను నోచుకొన
        జాలని ఎన్నివిధాల భాధలో
అన్నివిధాల నోర్చితి ! ర
        సార్ణవపూర్ణసుధాకరేందిరా !
మొన్నటినుండి గుండె లిక
        మోయని తీయనిబర్వు బెట్టితే ?

ఇది నా ఒక్కనిలోని ఆర్తి యనలే
        నే ఎందరో ఎందరో
ఎదలన్ దండితుఫాను లుండియును తా
        మీరీతి వాచాలతన్
నుదురున్ నెత్తులు బాదుకోక మరి న
        నోళ్ళ లేక నావంటి ఏ
వదరుంబోతునో ముందు నెట్టెదరు నీ
        ద్వారాన హోర్వెట్టగన్.

ఓచెలి ! ఓచెలీ ! బ్రతుకు
        యోగము లే దిక నాఎడందలో
కాచిన ప్రేమపుంజమురు
        కన్నుల వేలకొలంది వత్తులన్
వైచి యనుక్షణ మ్మెదురు
        బారులు దీర్చిరి కాంతిలావికల్
నీచివురాకువంటి పద
        నీరజముల్ వెలుగొందరాగదే !

ఒంటిగాణ్ణయి నిల్చి కాలూనలేను
కడుపులో తలబెట్టెద, గదువబట్టి
బ్రతిమిలాడెద నన్విడువకు విడువకు
నేను జీవించలేను జీవించలేను.

ఏ నొనరించినట్టి దోక
        డే యొకపాపము నిన్ వరించుటల్
నే నొనరించనట్టి దోక
        డే యొక పున్నెము నిన్ త్యజించుటల్
ఈనడుమంతరంపుబ్రతు
        కే యొక డడ్డము నీకు నాకు ! దూ
రాన వెలుంగుకాంతి పిస
        రా ! ఇవిగో కను లీదరాదటే !

ఈ వెట దాగియున్న నట
కే మరి దేకెద తాకిచూచెదన్
చేవ లడంగి గుండెపస
చీకయి ఆశలు నీరు గారి, నీ
దేవళపుంగవాతమున
దేబెగ నిల్వ సహింపనే యహం
భావపుపొంగులం దవయ
వమ్ములు పొల్చినదాన! రాగదే!

మడుగున బండి నీడ్చుకొను
మాదిరిగా బ్రతుకీడ్చుకొంచు నీ
యడుగుల జాడలంబడి ప్ర
యాణము గట్టితి, ఎచ్చటో కడుం
గడుచిరుమిన్కుమిన్కు మను
కాంతివలెన్ గనుపించె దీవు నే
మడిసినపిమ్మటన్ పనికి
మాలినదా విధి పాపమెట్టులే ?

ఎరుగుదు నందరున్ దొరలె
ఏమియు దొంగిల చేతగానిచో
ఎరుగుదు నందఱున్ మునులె
ఎంగిలి విస్తరి యైన లేనిచో
తిరుపెము నెత్తి సాకగల
ధీరుడనే కలకాల మోళరత్
తరుణహిమాంశుఫాలచకి
తాలక! నన్ విడబోకు మెన్నడున్.

ఎరుగుదు నీవు కన్గవల
నెత్తక చూచెడి వైనమంత, నిన్
మరిగిన నేను ప్రొద్దులును
మాపులు నిన్ విడిపోవకుండ నే
తిరిగెదనేమొ పాపతెర
దీసినవేళల నెల్లయంచు ని
న్నిరకటమందు బెట్టునుగ
దే ననుగూర్చినజంకు నెచ్చెలీ !

పసరికపాముల ట్లురుకు
పచ్చనిచేనుల పిల్లకాల్వలం
దిసుకపిసళ్ళ జిల్గు కెదు
రీదెడి మీనుల చిన్నిచిన్ని క
న్గొసల ధగద్ధగల్ మిసిమి
గుల్కెడి మైపొలసుల్ కనంగనన్
గుసగుసలాడిన ట్లగును
గుండియలం దొక ఆసపోలికన్.

ఈకను లేమి కన్నులో సు
మీ ! జల ఎండిన లోతుబావియం
దేకొనయందొ మొల్చెడి ఒ
కేయొక సన్నని పచ్చదర్భతే
తాకువలెన్ చిగుర్చు నొక
ఆసనుమాత్రముదాల్చియుండు తా
మే కడసారి చూపులకొ
ఈబ్రతుకంతయు మోయునట్లుగన్.

నాతిహాసద్విశాలనయ
నా ! ఘనమా ? నను గాన, నాసమ
స్తాతిశయంబు నీ చరణ
దాస్యములో వినియోగమొందనే
నీతరియించునట్టు లని
ఎంతయు నమ్రమతిన్ దలంచు ఈ
నాతికఠోరదర్పుని గ
నన్ పువుచెక్కిలి నీటిచుక్కవై.

ఒక పండుటాకు రాలునపు
డూగిసలాడి తారాడ
నొక పితామహు డంపసెజ్జ
నుండి ధర్మోపదేశ మిడు
ట కుపక్రమింప మృత్యువు
విడంబించు ; బ్రతికిన నెవ్వ
రికి వారె బ్రతికి, చావ
నెవరికి వారె చావరు ఘనులు.

ఎవ డెరుంగడు నీగుండె లెంతలెంత
తరిగికొని పోవునో, ఎడంద కరిగికొని
పోవునో, నే నెరుంగుదు పూవురిక్క
కందినపు డెల్ల నీబెట్టు కంటనీరు.

తనశుష్కస్తనముల గొని
మునివ్రేళ్ళను నలుపు శిశువుమోమున ఆవే
దన గని ఉస్సురు మను త
ల్లిని గాంచిన తల్లడిలవె రేలున్ బవలున్.

పా లెండిన పొదుగులతో
జాలిగ తిరుగాడు జింకచానలనోటన్
తా లేశమైన పచ్చిక
కాలే నని కుందు గరికగరితను గనినన్.

ఆయెండిపోవుగరికకు
అయువు పోయంగ నొక్కయశ్రుకణ మ్మేన్
మాయిూకన్నుల కీరా
దా యంచును కుములు జింకతల్లుల గనినన్.

చెలి! చెలి! ఎంతకాల మని
చేదును మేపెదు? తీయతీయ కో
ర్కెలమొలకల్ ఫలించి ఎద
క్రిక్కిరిసెన్, కనలేవొ, ఇంతక
న్నుల పదియంతలౌ తళుకు
నూల్కొను మక్కువమిక్కుటంపుసొం
పుల గిలకా! కనంబడక
పో, అడుగంబడకుండ పోవగన్.

ఈవనలక్ష్మి వీ వనుచు
నేను వసంతుడ నంచు, రేబవల్
పూవులతెప్పలో గడచి
పోవును నాబ్రతు కెల్ల యంచు, నీ
త్రోవల గాపు లుంటి, నెవ
రో ఎపుడో ఎటులో మునుంగు నా
నావను గట్టు కీడ్తు రను
నమ్మకమున్ గొని నీ వెరుంగవే.

రొమ్మున కుంపటింబలె వ
రోరు ! వర స్తని, అస్తినాస్తిమ
ధ్యమ్మ ! సమస్త మీ బ్రతుకు
యాతనకున్ బలివెట్ట నెంచితే ?
ఇమ్మెయి జీవితాంత మొక
డే కల నైన సహించు టెట్లు
నిన్ నమ్మినవాడె లేనియెడ
నాశ మొనర్తు వె నమ్మకస్తులన్.

ఏది నీఎద విప్పు మచ్చ టెవడే
నీ పొంచులన్ వించు నా
మీదన్ నీ కనుమానముల్ ప్రబల బ
లిమిన్ జేయుచున్నాడో ? నే
చేదున్ మేసినజోదుశిష్యుడను నీ
చిత్త మ్మేదో వల్లగా
రాదే ఈడ్చేద వాని రచ్చకు, ద్రవ
ద్రాక్షాసవోర్మిప్రభా !

నాదారిని గోదావరి
గా దారసిలిన ఒకానొక పసిడికొమ్మా !
ఏదీ నీఎద తెరువుము
నాదాహము యుగయుగాల నాటిది సుమ్మా !

ఈ యనుక్షణయాతన ఎంతమధుర
మెంత మధురము ? నీవేని ఇంతమధుర
మగుదువో కావో ? చూడగా దగును వచ్చి
ఎవరు మిన్నలో తీపిలో నిర్వు రందు.

ఇది ఫల మ్మంచు లేనెలే దీతపస్సు
నకు, ఫలమ్మైన బహుయాతనాఫలమ్ము
ఆంతరోర్మిన్ ప్రహదమ్ము రొమ్మంతపగిలి
పైకి తేటగ నిల్చి కన్పడు విధాన.

నీ తడిలేనికన్నుల క
 నీనము చెమ్మగిలంగ జేయ నా
యాతనలన్ని నిష్ఫలము
 లై నను సన్ననియాస వీడ దీ
నాతను వెల్ల కన్నుల నొ
 నర్చి చొరంబడె దన్నిచోట్ల సం
ధ్యాతరుణీకపోలకుసు
 మాయితచారుతటిత్సుహాసినీ !

ఇది నిరీక్షణ గాని నిరీక్షణ ; ఇది
జీవితాంతిమయాతన, జీర్ణశిథిల
గర్భమందిరమందు లింగమ్ము ముందు
అదియె నరదైవ బలముల తుదిపరీక్ష.

కొనయూపిరి పోవుదు నను
కనులో మరి కొంచె మాగగావలె నను, ఆ
గనులే దేగనులే దది
మునిగాళ్ళను నిలిచియుండు పోవగనుండున్.

అని నిలువెల్ల తుత్తునియ
 లై ఎద వ్రక్కలు నై ఘటమ్మునం
దణువణువున్ జ్వలింపగ కృ
 తాంజలినై కనుచిప్పలందు ఆ
సను బిగబట్టి నిల్చితి ; ది
 సల్ గని గుండె కరంగి కంటవె
ట్టిన తడినుండి వీచు ఒక
 డే ఒకచల్లనిగాడ్పు సోకగన్,

ఊఃకువ నొక్క బాలపవ
        నోర్మిక సన్ననిఎల్గు వీనులన్
దాకుట ఏమి ? సర్వకవి
        తాపరమార్థము నామనస్సులో
ప్రాకుట ఏమి ? జన్మ శివ
        రాత్రిగ ఆత్మ భజించుటేమి ?
ఈమ్రాకు చిగిర్చి మొగ్గ లిడి
        రంజిలుటేమి ? అరక్షణమ్మునన్.

అది యానందమొ దుఃఖమో ఎరుగన
        న్నా ! చిమ్మచీకట్లలో
నుదయమ్మైన ద దెన్ని వన్నియల ప్రో
        వో, ఎన్ని కండ్లన్ కళల్
వెదజల్లంగల వజ్రపున్రవల ని
        ల్వాత్తైనకంబమ్మొ నా
ఎద మార్మ్రోలలు పుల్కరింపు లయి చూ
        పేగాని నో రాడదే !

పులకరించిన రోమాళి పలుకరించు
వర కెరుంగను మోదబాష్పాలజాలు
కనుల మిరుమిట్ల చేతులు కదలి నులుము
వర కెరుంగను వెల్గు కంబంపుసొంపు.

ఇంత పెద్దయౌ కాల మీ వెచ్చ లెచట
వెలిగి రంజిల్ల జేసినావే ! సమస్త
కావ్యసౌందర్యశిఖరాగ్రభావ్యమాన
రసకళామాతృమూర్తీ ! పరాకుసువ్వె.

ఇక నీయాకృతి గాంచినట్టి కనులం
దేరూప మాచంగలే
దిక నీకాంతి వరించినట్టి కనులం
దేచీకటుల్ గ్రమ్మలే
విక నాయీకను లుండనేల ? మరి నీ
వే సర్వమై వెల్గు వా
లకమున్ బట్టెద నంచు సర్దుకొనువే
ళన్ మాయమయ్యేన్ సుమీ !

మరల యాతన మొదలయ్యె ; మరల కనుల
కొక్కగాలింపు మొదలయ్యె , ఊపిరంత
కనుల బిగబట్టుకొని గుండె గాడిపడ్డ
ఈ ఘటమ్ముమ్మను నెట్టుచు నేగు దేను.

మరల తిరుగుడుకు మొదలు ; మరల కనుల
కెదురుచూపులకు మొదలు ;బెదురుగుండె
మరల ఆగుటకు మొదలు , మరల మొదలు
దేనికై తపియింతునో దానియలు ?

ఉరుము ఉరిమినది మెరుము మెరిసినది ; చె
లీ ! పలుకలేదు ; నవ్వను లేదు నీవు ;
వాన వెలిసినది వరద పారినది, చె
లీ ! కదలలేను పాడగాలేను నేను.

రసము తొణకినది వలపు రగిలినది ; చె
లీ ; కదలలేదు, కదుపగా లేదు నీవు
కరుణ మొలికినది కనుల నొరిగినది ; చె
లీ ! పలుకలేను పలికింపలేను నేను.

ఒక్క చిరునవ్వుకోసమై ఉగ్గబట్టి
ఒక్క కడగంటి చూపుకై ఊపిరాగి
ఒక్క చక్కిలిగింతకై ఉన్నదంత
ముడుపుగట్టితినే చక్కనడుగులందు.

ఏతలపూలవాసన మ
రీ ఎదలోనికి చొచ్చిచొచ్చి నా
రాతురులన్ పవళ్లను వి
రామము లేని సుగంధవీచికా
వాత్రితము జొన్పుచుండు పసి
పాపలనోళ్లుల తల్లిపాలుగా
ఆతరుణప్రసన్నమమ
తార్తుల సంకలనమ్మవై నటుల్

ఈవు లేకున్న బ్రతుకు నూహింపలేని
దైన్యభావంపుక్రింది యంతస్తులన్ని
ఒక్కటొక్కటి జారి ఈ యూబిలోని
అడుగుమట్టమునుండి నే నరతుగాదె.

సేతువునుండి శీతనగ
సీమలదాకను మాకనుంగవల్
మూతలు వడ్డ పాడుదిన
ముల్ గతియించి సమస్తభారతీ
చేతన మొక్క జాగృతికి
చేరిననాటి స్వతంత్రకాంతి సం
ఘాతములో వెలింగిన అ
ఖండచిరంతనమాతృతేజమా !

నావలె ఎందరెంద రిల
నమ్మిరో నిన్ను ముహూర్త కాల మే
నీవిరహానలచ్ఛటల
కింధనమైన ఎడందలన్ నిదా
ఘావసరప్రయాణజల
కాంతులుగా మహాదూషరాన జ్యో
త్స్నావలయీకృతాబ్జనయ
నా ! స్మరియింతువె వారి నెప్పుడేన్.

అలనాడీవయి నీవు వచ్చి మహోదా
ప్యాయమ్ముతో నేత్రమ
ట్టులకైకైగొని వెంటరాగ నవనా
డుల్ చందనమ్మందు చిం
దులు ద్రొక్కం దనువంత తేలికయి ఏ
దో క్రొత్తలోకాల చు
క్కలలో సూర్యునిలోన చందురునిలో
కల్పాంత మున్నట్లయెన్.

ఇరువది యైన కాలబడ
వెంతమతిభ్రమణమ్మొ ఎంతతొం
దరో మరి యాగ మెంతటిదో
తా నొకచో నిలువంబడంగ లే
దురుకులు దప్ప ఈబ్రతుకు
ఉస్సురు మన్నను నాశమైన తా
నొరిగెడిదేమి ఏరి కిల
ఉండిన ఊడిన నే నొకండనై .

అనగలవా ? ఎవం డితడ
టంచు ? పురాకృతమేన్ రవంత లే
దనగలవా ? సమస్త మగు
యాతన వట్టియబద్ధమేని వ
ద్దనగలవా ? రస మ్మని మ
హాకవి చెప్పిన దెల్ల కల్ల లె
మ్మనగలవా ? మరింత పరి
యాచక మెందుకు రాక పల్లగన్.

నీ వెపుడో కనుంగవకు
నేర్పితివే తడివెట్ట అంతయే
జీవితమంత గడ్డిగఱ
చెన్ వయసంతయు చెమ్మగిల్లె నా
యీ విపరీతవర్తన మ
హేతుకమై నిజజీవితాంతబా
ధావివృతమ్మె నౌచు ఎగ
దట్టెడు నూతనయాతనాళికిన్.

ఎరుగుదు సుఖదుఃఖములకు
పరిమితి కలదంచు ఆత్మపరిణతికోలదిన్
చరియించు కాల మవధుల
నిరికించెడి కోలదిసాగు ఏమరుపాటుల్.

నాకవితాసరస్వతికి
నాలుక లే దొకగుండె దక్క ; మే
లౌ కనుచూపులే దలుక
లావగు నశ్రువు దక్క ; తాను తా
నై కదలంగ లే దొకరి
యాసరవెంబడిదక్క ; ఇంక ఏ
సాకును చూపి తాను మన
జాలునొ నల్వురినోటిముత్యమై.

పయమృతతుణమ్ముకొర
కేను తపించితి, అల్లనాడు రా
మాయణ కోకిలంబలె మ
హార్తి "విరామ" మెరుంగ కిన్ని నా
ళ్లా యిహాసర్వకార్యకరు
ణాయతనాకృతి నన్ను జేరగా
దీయునొ ? రామభావరస
తేజము ఆతని చేరినట్లుగన్.

ఇదివర కే నెరుంగను సు
మీ అరలున్ మరలున్ మనస్సులో
పదిల మొనర్చుకుంటి నని,
పండె తప స్సని, నిండె గుండెటం
చెదియెదియో నిరాశపడ
నీయని నే స్తము గంపెడాసకున్
గదుము విధాన ఈ బ్రతుకు
కానుక బెట్టితి నీపదాలకున్.

మన మనుగడ అడుగడుగున
కనకన నిదియే సజీవకావ్య మ్మనిపిం
చును, సర్వ మ్మిది ఎ
వ్వనిదో కన్నీరు జాలువాటినయట్టుల్.

స్వరమైత్రిన్ బడి సాగివచ్చెడి మనో
జ్ఞమైనవాదమ్ము చె
చ్చెర రాగాకృతి దాల్చినట్టుల వచ
స్సీమంతినీ ! నీహృదం
తరసౌభాగ్యమె భావనన్ బడి రసా
నందస్థిర మ్మైన య
క్షరరమ్యాకృతి దాల్చి వేద మగు శా
స్త్ర మౌమ్మను కావ్య మ్మగున్.

కొంద రుందురు రసముముత్తువులు వార
లెందునై నను భౌతికానంద మధిగ
మించు సుకుమార శబ్ద సమ్మేళనాన
హృదయ ముప్పొంగ నిన్ను కాంక్షించుచుంద్రు.

నీకథ కంతమంచు రమ
ణీ! ఎవ డాడు ? హిరణ్మయమ్ముల
స్తోకరసప్రపంచపరి
ధుల్ సువిశాలము, లీవు మెచ్చినన్ ;
నాకు సమానధర్ము డయి
నన్ ; భజియించుత్వత్ప్రసన్ని ని
ర్వ్యాకులరామణీయకత
నస్మదుపార్జితవాగ్జగమ్మనన్.

ఎవ డైన నేమి నిన్నెప్పు
డెదలోన పవళించుదాని
భువనాల శుభము గూర్పంగ
పొమ్మని గదుమువాడు కవి,
సవనాన ఆహుతి జేసి
సర్వమ్ము, స్వర్గమ్మమాత్ర
మెవ డేలుకొను నని దులిపి
ఏగు శతక్రతువు కవి.

మకుట మ్మొటంచు శిరాన
మాత్రము లేదు ; జగత్తు
నకు వానిచేచల్వలో అ
నంతసుఖా లిచ్చు సత్తు
ప్రకటించుకొన సిగ్గు
పడు శివాకృతి వాని ఎడంద
ఒక మహాకవి రాము డయిన
నొకమహాకవి కృష్ణు డగును.

ఇది పురాకావ్య వైభవము
నిగిలించువారికాలాన
ఉదయించగా బెదరిన ర
సోద్యానచేతః కిరణము
పదికాలములపాటు వెలుగ
వలెనన్న పోషింపవలయు
ఎద విప్పి పయ్యెద గప్పి
"ఇంద" పాలను తల్లి వలయు.



కనపడు మూడుకోట్ల మెడ
కాయలపై తలకాయ లూగ నా
మనమున దోపనిమ్ము నవ
మాధురు లూరెడు భావనాస్రవం
తిని, పదజాలమున్ మలచి
తెప్ప నొనర్చి, మునింగి, తేత్తు నీ
అనుమతి నీయవమ్మ తెను
గమ్మ సరాసరి క్రొత్తముత్తెముల్.

నన్నయనుండి నావర క
నర్గళ మైన రసస్రవంతి సం
పన్న మొనర్చి రే తెనుగు
బాసను వారిని సంస్మరించి యా
వన్న వభారతోర్వి గల
బాసల గౌరవ మూహ చేసి నా
కున్న కవిత్వపుం జౌరవ
నూతగ వ్రాతు మహాకవిత్వమున్.

నాకును కొంచెకొంచె మయి
నన్ రసమన్న, కవిత్వమన్న ఆ
యా కళలన్న ఇత్థ మని
ఆత్మ నెరుంగగలట్టిశక్తి ఏ
దో కల దేమొ దాన ఇటు
లూపిరి సల్పగనీని వేదనా
వ్యాకులితప్రపంచమున
కంకితమయ్యె కళానివేదనల్.

ఇందరియందు జూచుకొని
ఏకవి పొంగడు ? మాతృవాక్సుధా
బిందువులే గళమ్మున స్ర
వింపవు ? వార్షుకమేఘ మాకస
మ్మందున గాంచి ఏ నెమలి
యాడదు కావ్యరసజ్ఞలోక మా
నందము నొంద ఏకవి పి
నాకిజటాళిరేఖ కా డిలన్.

కలదు రవంతదర్పము ము
ఖమ్మున వాక్కున నామనస్సు ని
ర్మలినముగాన ఆత్మయు హి
మస్ఫుటశుభ్రముగాన, లౌక్యముల్
తెలియవుగాన ఉన్న ఒక
తెల్వని ఈశ్వరి కప్పగించి నే
నిలిచితిగాన గుండియల
నిండుగ నుండునుగాన వేదనల్ !

నన్నయతిక్కనాదుల పు
నాదులు వేరు, మనాది లేని వా
రున్నదినాలు వేరు, మన
మున్నదినమ్ములు వేరు వారి క
ధ్వాన్నపుకూటిగుడ్డలకు
వాచిన దేబె ఎదల్ కనుల్ మొగా
లున్నవొ లేక బోలెడు మ
హోజ్జ్వల మైన తపస్సె యున్నదో !

చేడియ వాడికన్నుల వ
సించని సూదులు గుండెలందు మా
రాడక గుచ్చుకొన్నటుల
ఆర్చెడి బూర్జ్వలమాట నెత్తకన్
బోడిపసల్ వెలార్చుచు అ
పూర్వరసస్ఫురణమ్ము కల్గిన
ట్లేడుచు క్రొత్తనీరములు
ఎంగిలికాకులబోలి నెత్తకన్.

నాయలుపంపుజీవితము
నన్ పదునైన ఎదన్ గదల్చి రా
మాయణశోకగాథకు సు
మా రొకకోటివిధాల మించు నా
నాయమయాతనల్ పడియు
నల్గురిలో బడకుండ గ్రుక్కికొం
చేయపురూపపున్ బ్రదుకు
లీడ్తురొ వారిని సత్కరించెదన్.

వెధవబ్రతుక్కి దొక్కటి క
విత్వపుపిచ్చి జగత్తునంత స
త్పథమునకున్ మరల్చు జవ
దార్ఢ్యము లస్మదుదాత్తలేఖినీ
రుధిరములన్ సమృద్ధిగను
రూఢిగ నూరుచు పొంగి, పారి, పె
న్నిధులను దర్శిపోయునను
నీల్గుడు నన్నుబికించు నిత్యమున్ !

ఆరయ నిర్వ్వరే యిరువు
రాధునికాంధ్రవచస్సరస్వతీ
హారమణుల్, జనప్రియమ
హాకవివాచ్యులు—వారిచంకలన్
దూరుటకంటె మే లెవరి
త్రోవన వా రెగుడుల్ దిగుళ్ళగా
చేరెడి డొంక యేని రస
సిద్ధికి వారలె పుస్తె గట్టిరా ?

ఇల ఆనందరసప్రవాహమున కం
తే లేదు, చిన్నారిదో
సిలితో ఎంతని త్రావ నోపుదుము ! మా
చిన్నారి కన్నాల రె
ప్పలలో నీబహుకాంతిపుంజముల సం
ఛాళింతు మేలాగు మా
మలినోద్యానమనఃకవాటముల న
మ్మామ్మ ఎన్న డూడ్పింతువే !

ఈ జగ త్తున్న దే దీని కెన్ని తరత
రాల లోతులకాను మర్యాద గలదొ ?
అది సమీక్షింపబడవలె ; అందు చెడ్డ
పరివేయంగబడవలె, ఇదిసుమి పని !

వెధవ గులాబిగుత్తుల క
విత్వము నెన్నడు సన్యసింతురో
వ్యధ యన నప్పు డర్థమయి
వాక్కు నకున్ పదు నబ్బునంచు నా
కధమము లక్షసార్లయిన
ఆత్మకు దట్టెనుగాని ఎన్నడె
వ్విధమున నుద్యమింతు నని
వేచితి నింతయు బెద్దకాలమున్.

ఒక మహద్దుఃఖ మున్న మ్రింగి కుములవలె
ఈ యనంతప్రపంచాన ఏడ్చుకంటి
తడిని తుడిచెడివాడె కన్పడడు బహువి
లాసలాలసనీరసాలసము జగము.

కడుపున కాళ్లు తన్నుకొని
కంబళమున్ బిగియించుకొన్న మూ
ల్గుడులను విందునా ? పసిడి
కొమ్మలపాన్పుల మెత్తమెత్తరా
పిడులను విందునా ? పగిలి
వ్రేలగబోయెడుగుండెకాయసం
దడులను విందునా ! ఇవియు
దంతము లార్ద్రిత లేని కన్నులన్.

పందులు పొర్లుసందుల త
పమ్ములు కాపుర మున్న కష్టగా
ళ్ళెందరో లెక్క జూపిరి ఓ
రేయ్ ! మనపొట్టల ప్రేపు లీడ్చురా
బందు లివిన్ని కోట్లని ప
వళ్లను రేళ్లను రెక్క లూడ్చ త్రా
గేందుకు గంజి నోచని ప
కీర్లను జెప్పిరి లక్షమందిపై.

వాళ్లు పవళ్లు రేళ్లనక
వంచినఒళ్లును లేపకుండ ఘో
కాళ్లపగుళ్లు, వెన్నెముక
గళ్లుపడన్ మనతండ్రితాతలో
వాళ్లసుఖాలకై బ్రతుకు
బండలబర్వును మోసి మోసి మా
మూళ్లను గిట్టనట్టి గత
ముల్ గతు లేద్వని వర్తమానముల్ !

ఒకమహోదధి ఉచ్చలదూర్మినివహ
మల్ల కల్లోలముం జేయ ఆగమాగ
మై యవస్థతో పెల్లుబ్బి యార్చినట్లు
కోట్లమంది కోట్లపనులు, గోలమండ !

ప్రతిముఖానికి ఏదో చిరాకు, కొంప
మునిగినంతటితొందర ! ముక్కు పచ్చ
లారని వెధవ, రాచకార్యము లవేమొ
తగులబడినట్టు లురుకు పరుగుపరుగున.

ఇది కవిత్వమ్మె కాని నచ్చదు, విమర్శ
మనకు పూర్వోక్తసూత్రసమ్మతము గాన
ఇది కవిత్వమ్మెగా నచ్చున దెవని కిక ?
ఎవనిగుండెల్ చెమర్చగలవొ, ఎవనికి
సానుభూతిని పొంది నై సర్గికాశ్రు
కణము వదిలెడుగుణము కన్గవల కలదొ !

తీరము గానుపించని న
        దిన్ బడవై చితి జీవనావ ; గం
భీరజలప్రవాహమున
        భిన్నము గాక మఱేమియౌను ? నీ
వేరికి సాయ మైతివి వ్య
        యించెదలే ఎటులై ననేమి ? నే
నేరికి పట్టి లేనని గ్రహించితి
        లే, మును ఎప్పుడో ప్రభూ !

గ్రుడ్డిపొగ త్రాలం బడి గ
గుర్పొడిచెన్ సనసన్న వెంట్రుకల్
వెడ్డిగ కొన్నినాళ్లు ; మన
వెట్టితన మ్మది పొంగి పొంగి ప
గడ్డకొ పేరుకొన్ననురు
గై కనుపించిననాటినుండి ని
న్నడ్డము బెట్టి జారుదు న
యా భగవత్కృప యంచు నో ప్రభూ !

కడచినవత్సరమ్ముల న
గాధములో బడద్రోసి ముందు వ
చ్చెడి వయసంత దుష్కృతిని
షేధమునన్ విని యోగ మొందు క
ట్టడి నొనరించినాను కప
టమ్ము మమత్వము లేక సాధునై
నడచెద ఈ యనాథశర
ణాలయమం దొక దీనుడన్ ప్రభూ !

ఎన్నడుగాని ఇంతగ త
పించదు నాఎద, గుండె లింతగా
నెన్నడు కొట్టుకోవు మఱి
ఎన్ని యుగమ్ముల నోచుకొన్న నా
పున్నెము పండిపండి యొక
మో మొకము క్కొక రెండుకన్నులై
తిన్నగ లేచి నిల్చినది
తీరనికోరిక తీరుగా ప్రభూ !

నాదగు వేదనాహృదయ
నాదము నీచెవి కింపు గానిచో
రాదగు నాలసింపక ప
రాకును జేయుట పాడిగాదు నీ
వే దయచేయగావలయు
ఈ 'స్వరభంగుని' కేమి నేర్పి స
మ్మోదము గూర్చికొందొ నను
మూకను జేసిన శాస్త్రి కోపప్రభూ !

కను లున్నందుకు వెళ్లబెట్టినదియున్
కన్పించ దో యన్న ! లే
వనుకున్నన్ మఱి కొంప మున్గినది
లే దన్నా ! జగ త్ప్రాకృతి
తిని సంసారము జేయనేర్చినది వి
స్తీర్ణించు మర్యాద నే
ర్చిన దీ వున్నను లేకపోయినను,
నీ చిక్కంత నాకే ప్రభూ !

నేను దయాప్రహారముల
నేకముగా తిని నే డజీర్ణరో
గానికి మూలపూరుషుని
గా జగమంతట వ్రాసికెక్కితిన్
తాను రసాన్నపూర్ణ సత
త మ్మమృత మ్మొకపాత్ర నిండుగా
పూని ఒకొక్కచుక్క వడ
పున్ తడుపున్ వలదన్న నెంతయున్.

# రసవసంతం

ఏ నెరుంగ వసంత మనునది
ఎపుడు వచ్చెనో నావయస్సున
ఏ నెరుంగను మందమారుత
మెపుడు తాకెనో ఈ మనస్సును.

ఏ నెరుంగ సుగంధమధుర
స్నానచందనసంభ్రమమ్మును
ఏ నెరుంగ పికీగళమ్మున
కింతతీయనిపాట కల దని.

లేత లేతగ తాకి ఎవరా
లేమ నింపిన దిన్ని తేనెల
కొమ్మచంకల రిమ్మపాపల
నిమ్ముగా నందించె నెవరో.

రెమ్మ చన్నుల తేనెపాలను
ఇమ్ముగా నింపినది ఎవరో
మొగ్గరిక్కల నరనరమ్ముల
నిగ్గులను నింపినది ఎవరో.

పచ్చలారని ముక్కు లెఱ్ఱగ
బార కులికెడు చిలుకపెండ్లికి
విడిదిపందిరి వేయ చిరుమా
మిడులతోపుల నిలపి రెవరో.

నే నెరుంగను పుడమిపడతికి
నిరుటి జవ్వన మిచ్చి రెవరో
నామన స్సుద్యానవనమై
నాడు మందాకినుల బారగ.

తనువునందనవనపుచందన
తరుపరీమళపులకితమ్మై
పుడమి దాకని యడుగు లలలై
నడక ఒయ్యారముల ఫణిౖయె.

ఆడె గుండెలలోన యే రా
యంచ పడుచులో సరసిలో వలె
అసలు నా కనుపించినది నా
డాకసమ్ముౖన కెగురవచ్చని.

నాడు జాబిలి నడిగి దోసిట
వేడివెన్నెల తెత్తు నంటిని
నాడు చుక్కలకుప్పలో కడు
నచ్చినట్టివి తెత్తునంటిని.

నాడు నా కాళ్లుండె మన్నున
నాడు నాకం డ్లుండె మిన్నున
నాకు కన్పడనట్టివాడే
నాడు పాపము జేసినట్టుల.

కోట్లతనువుల కౌగిలించితి
కోట్లగుండెల హత్తుకొంటిని
ఇది వసంతపు చేష్టయన్నపు
డది వసంత మటం చెరింగితి.



# నా మనసాయెనే

నా మనసాయనే! తెనుగు
నాట పసందు రసాల తోపులన్
మామిడి పూతగుత్తులను
మత్తిలి యొత్తుగ వీచు పిల్ల విం
జామర కైపు టూయలల
సంబరమున్ వడబోసి తెచ్చు ఈ
ఆమని యావహించు సమ
యాల పికాళిగళాల పాడగన్.

నా మనసాయనే! తెనుగు
నాడుల పారెడి వేడి నెత్తుటన్
ప్రేమము లూరగా, పులక
రించిన గుండియ తెల్ల యెల్లెడన్
సేమము పెంచగా పరవ
శించిన కూరిమితోడ మక్కువల్
సీమల దాటగా, గళము
జేర్పగ నాలుగు కోట్ల గొంతులన్.

నా మనసాయెనే! తెనుగు
నమ్మకముల్ బలువైన మక్కువల్
గ్రామములందు చేబదులు
గా దొరకంగ పరస్పరమ్ము నే
దో మధురమ్ముగా బ్రతుకు
ద్రోవలలో పయనించుచున్ పరం
ధాములుగా రహించెడు సు
ధామయగీతిక లాలపింపగన్.

నా మనసాయెనే! ఎద పు
నాదులలోని అనాది వాసనల్
మామక సర్వ భావగత
మార్దవ మంతటి నావరించి, ఏ
ఏమరియాదలై బ్రతుకు
నింతటి కమ్మదదాన తేల్చె నా
యామరియాద లీ పదము
లం దపురూపపు తీపి నూరగన్.

నా మనసాయెనే! ఎదకు
నచ్చిన కమ్మని అమ్మపల్కు విం
దామని - చల్లనైన కను
దమ్ములలో విరజిమ్మ కాంతి కం
దామని - నా సమస్త కవి
తాబహుధారమణీయభావనా
రామ రమామతల్లి యల
రారెడి చోట వసింప బోవగన్.

నా మనసాయెనే! విసపు
నాగుల కోరలు దీసి యాడుకుం
దామను పాలుగారు సర
దారులు దూకుచు చిందులాడ కం
దామని - కోర లూడి పసి
తామరకాడలరీతి పారిపో
దామని కాళ్ళలో సతమ
తమ్మగు నాగుల ఆగమున్ గనన్.

నా మనసాయెనే! పరతు
నా ? పువుమెత్తని కంబళా లటం
చామనిపిల్ల చేతిచలు
వంతయు గ్రుమ్మరింపగా
సోమరి కోకిలమ్మ విన
సొంపగు కమ్మనిపాట నెత్తి నా
సీమకు సీమనిండ దయ
సేసిన రాగసుధన్ రసింపగన్.

నా మనసాయెనే! తెనుగు
నాల్కలకున్ నిజమాడు బుల్పు ని
ద్దామని - గుండె గుండె పర
దాల్ తొలగించుచు తొంగి తొంగి చూ
ద్దామని - కూర్మి కూర్కొనిన
తావుల లోతుగ ద్రవ్వి పెళ్ళగి
ద్దామని - లోని మంచిదన
మంతయు నుండల జేసి పంచగన్.

నా మనసా యెనే ! ఉపవ
నాభరణా లయి వన్నెవన్నె నె
మ్మోమ్ములు లేతలేత మొగ
మోటము లారసి లేకవుంగిటన్
సేమపుముచ్చటల్ జరిపి
చిక్కని తేనియ లారగించి పూ
లేమలకున్ విమానముల
రీతి నిలంబడు దుమ్మెనల్ * గనన్.

* దుమ్మెన=సీతాకోక చిలుక (తెలంగాణపు పలుకుబడి)

నా మనసా యెనే ! తొలిది
నాల సుఖాలు మదిన్ కెలంకగా
మోములు వాచినట్టి జన
మున్ కరుణింపగ వచ్చు ఈ శరత్
స్వామికి స్వాగతాంజలిని
పాడగ, హాయిగ ఊపిరాడ బా
ధామయజీవితార్తి పరి
తాపసమాప్తికి నాంది పాడగన్.

నా మనసా యెనే ! జనగ
ణమ్ముమ మన మ్మధినాయకమ్ముగా
మామక మాతృగీతము హి
మాలయమందు ప్రతిధ్వనించి నా
సీమకు సీమయే పరవ
శింపగ, సేతువు పుల్కరింప- ఈ
భూమియె నాకు తల్లి, ఇట
పుట్టుటె పున్నె మటంచు పాడగన్.

# "శివమెత్తించకు"

శ్రీగంధమ్మున నలందికొన్నటుల
రాశీభూతమాంగల్యకో
శాగారమ్ములు చేతి కబ్బినటు
లీశావాస్య సేవామహో
ద్యోగానందము గుండెనిండినటు
లే యుర్విం రహిం త్రమ్మహాం
ధ్రీగోత్రారజితాద్రిరత్నమ నుతుల్
శ్రీ మెట్టు రామేశ్వరా !

కైలాసమ్మును వీడి వచ్చుటకు
కార్యం బేది వేళాయె గా
రీలాస్యాలసకింకిణీరవరస
శ్రీదర్శనం బేలకో
లీలాభ్రూనటదుగ్రరాగనవశై
లీన్యాస నిక్షేపముల్
శీలమ్మౌనటె వింత మక్కువలు పో
శ్రీ మెట్టురామేశ్వరా !

కడుపారం గనినట్టి తండ్రికిని నా
కష్టమ్ము లర్పింపగా
వడగాడ్పున్ బడి వచ్చి వ్రాలితి గదా
పాదాలపై, నన్ను ఎ
క్కుడు ప్రేమన్ తలనొత్తి లేపి కనులన్
కోర్కెన్ ప్రసాదించి వ
చ్చెదు త్రోవం బడనట్టు లాపుకొనవే
శ్రీమెట్టురామేశ్వరా !

వలదన్నన్ విన వెంత మొండివి శివా !
వాత్సల్యముల్ జాలు ని
ష్కలుషాప్యాయసుధాప్రసేచనము లీ
కట్టెన్ చిగుర్పించ లే
విలలో జాలికి తావు లేదు మరి నీ
యీ మక్కువన్ బొంది రా
జిలునే మానవమాత్రుడైన పశువో
శ్రీమెట్టురామేశ్వరా !

నేనా ధూర్జటి గాను పద్యములతో
నీ గుండెలం ద్రవ్వ నా
జ్ఞానమ్మా బహుజన్మ పక్వమయి నీ
సాయుజ్యమున్ జేరు సో
పానమ్ముల్ పొసగంగ నేరనిది మ
త్ప్రారబ్ధరేఖాగతి
శ్రీ నిర్మాణము జూడ వక్ర మెట్టులో
శ్రీమెట్టురామేశ్వరా !

ఏ పాతాళపు లోతులం దొలచి యో
యీ గంగ తా దెచ్చె యీ
పాపక్లిన్నబహుప్రయాస బహుళ
వ్యాసంగలౌక్యమ్ములన్
తాపమ్మొందు నరుండు నిర్మలిన ని
త్యానందనిర్మాణని
క్షేపమ్మున్ భజియించు సాధన మనన్
శ్రీమెట్టురామేశ్వరా !

అతడా, ఆతని సర్వకావ్యగత భా
వావేశ మేదో మహా
స్థితి సంచారనిమగ్న మైనటుల నా
చిత్తానికిం దోచు ప్రా
కృతపుణ్యౌఘఫలస్వరూప మది
కానీ వట్టి పద్యమ్ములా !
చితి జేర్పన్ వలె నస్మదీయ కవితన్
శ్రీమెట్టురామేశ్వరా !

ఎది యైనన్ రచియింప బూనెదను
నే భావమో రాక మా
న దటంచున్ పదజాలమున్ వెదకుదున్
నానాచమత్కారసం
పద గూర్తున్ పదిపద్యముల్ వరుసగా
వ్రాతున్ మరావెన్క చూ
చెదనా అన్నియు నుండి నుండ దొకటే
శ్రీమెట్టురామేశ్వరా !

నేనే గందరగోళముఙ్ పడితి నం
చేద్వంగ మీరందరుఙ్
నానారీతుల గొప్ప చెప్పికొనగా
నవ్వంగ లేనట్టులే
ప నేద్వంగను నవ్వి, యేడ్చి,
ఎగతాళిం జేసి పాడౌదు రి
స్సీ! నీ వాక్కుల కందనట్టి పదవిఙ్
శ్రీ మెట్టురామేశ్వరా!

క్రుగ్గం బండిన పాండి తీగరిమతో
మర్దింప సద్భావముల్
నిగ్గుల్ దేరును, నీ వెదం గలుగ వ
న్నెం గూర్చు సత్కావ్యమై
బొగ్గుల్ బూడిద లన్ని యౌనె అరణిం
బుత్తెంచకన్ వెట్టి బో
సిగ్గుల్ మానిన శబ్దడాంబిక మిసీ
శ్రీ మెట్టురామేశ్వరా!

ఎద నీవై మెదడేమొ గౌరి యయి నా
యీ నాల్కయే వాణి యై
పదిమాటల్ దులిపించ రాదె కవితా
బంధాలలో చిక్కి నే
నెదురీతం బడలేను, నీదరికి రా
నే లేను, యేరీతి చే
రెద నారీతిగ చేదుకో దగుసుమీ
శ్రీ మెట్టురామేశ్వరా!

నీలో జాలి దుమార మేర్పడ మృడా
నీమాత దీక్షామతిన్
వాలుంగన్నుల శిక్ష సేసిన దయా
పారమ్ము లేమాయె ఈ
గాలింబో యెదు కంప వీపున
నిడంగా విస్మరింతేని నీ
శీలమ్మింతయ, చిన్నె లింతలెకదా
శ్రీ మెట్టురామేశ్వరా !

అవులే ! నీ కొనగూడు గొప్ప యని తే
దయ్యేన్ ననున్ బ్రోవ ఇం
కెవరైనన్, పశువైన, పామయిన ఆ
పన్నైన, పుర్వైన, మ
క్కువలే ? తక్కువవాడనే నొకడ నా
క్లో చాలు మర్యాదనన్
శివ మెత్తించకు, చెడ్డతిట్లు పడకో
శ్రీ మెట్టురామేశ్వరా !

గురియున్నన్ని దినాలు నీ పదములా
గొల్పించుకున్నావు నా
మరియాదం గనకుండుచే అసలు నీ
మర్యాద గాబోలు
ఆగిరికన్యన్ విడలేవి కామివి సరే
కీర్తింపగా చూడవా !
సిరికింజెప్పక పర్వులెత్తిన దొరన్
శ్రీ మెట్టురామేశ్వరా !

నవరాత్రాలకు వెంట దీసికొనిపో
నాగౌరి ? ఆవెన్క వ
స్తువు నీ గణమంత వెంటగొని నా
దాసమ్ము లేకుండ త
క్షువ గాకుండను ఆదరించుకొనె దీ
క్షాకైన్ ప్రసాదించు ఆ
చివరం జూచు కొనంగవచ్చు ఋణమో
శ్రీమెట్టు రామేశ్వరా !

ఇలలో రాముని వంటిదైవ మిక
లేనే లేదు పోండీ, ప దా
తలలన్ మొత్త మమాంత మెత్తు
కొని రాద్ధాంతమ్ము గావించు
వారలపై ప్రీతి వెలార్చు వారి మమ
కారా లేమియున్ వద్దు, నే
శిలగా మారిన యప్పుడే తెలియులే
శ్రీమెట్టురామేశ్వరా !

మాలో మాకు వివాదముల్ బలిసెన
మ్మా మేము మాటాడ మీ
వేలాగైనను కల్గ జేసికొని నా
దేమాత్రమున్ తప్పులే
నే లేనట్టుల నూరిపోయవలె త
ల్లీ యన్న కోపాని కా
రేలున్ బొద్దులు గుండెలన్ సెలగెదో
శ్రీమెట్టురామేశ్వరా !

మనలో మనకు తగాదా
లనగా విని నవ్విపోదురయ్యా! బాబూ
ఘనమౌనె ? మధ్యవర్తులు
వినగా, విని, చెప్పగా, వివేకముగల్గన్.

హేమాద్రిం బడి యొక్క చే తపసు లా
యిల్లాలు, దూరాన వీ
రేమో ముక్కు బిగించి కొంగజపముల్
రేలున్ ప్రొద్దు లాపిమ్మటన్
ప్రేమల్ - సేవల నొందినందులకె జూ
పెన్ పాశ మా పిల్లపై
సీమల్ దాటెను కీర్తు లిప్పటికె పో
శ్రీమెట్టురామేశ్వరా !

కథలే పుస్తె పుటుక్కు మన్న రతిమాం
గల్యమ్ము రక్షించుటల్
కథలే మ్రింగి విషమ్ము పుణ్యజనులన్
కాపాడుటల్, బొట్టిగా
కథలే మూడిన కాలమున్ మలిపి మా
ర్కండేయు నడ్పించుటల్
శిథిలాత్మున్ నను సద్ది నిల్పవనుచో
శ్రీమెట్టురామేశ్వరా !

భుక్తిన్ గోరను ముక్తిగోరను స్వయం
భూ శుద్ధచైతన్య మే
యుక్తిన్ శాంతిని బొందు నావిధము ను
ద్యోగింపవే, అల్పకా
వ్యోక్తిన్ స్వల్పచమత్కృతిన్ మరిగి
ఆయుఃక్షీణ దుష్కావ్య సం
సిక్తమ్మై చితుకంగ నున్నది సుమీ
శ్రీమెట్టురామేశ్వరా !

కదిలెన్ స్వర్ణముఖీ స్రవంతి వలె నా
కంటన్, తటానన్ దయా
స్పదమే మందిరమట్లు బిందు వొకడే
ర్పాటయ్యె, తద్గర్భమం
దుదయించెన్ చిరువెల్గు రేక మొకడే
యున్నట్టులే యుండం గూ
ర్చెదె కైలాసనివాస ధన్యపదవిన్-
శ్రీమెట్టురామేశ్వరా !

జల్పచ్ఛ్రోతవిపశ్చిదూహకలనా
సందిగ్ధసూత్రార్థ మ
త్యల్పస్ఫూర్తి నిగూఢమర్మశకల
వ్యావృత్త మౌచున్ జగ
త్కల్పాంత ప్రభవద్విచిత్ర రచనా
తత్వమ్మ నూహించి ఈ
శిల్ప ప్రాభవ మెంచి చేష్ట లుడుగన్
శ్రీమెట్టురామేశ్వరా !

ఎత్తై తాకు హిమాద్రి లోతగుచు
తా నీసంద్రమే స్వర్గపుం
సత్తాలన్ బ్రకటింపనిల్చినవొ ల
క్షల్ వత్సరాల్, ధర్మపుం
వృత్తిన్ మిత్తియె పూరుషార్థ మె అనా
వృత్తిన్ వరింతోయనిన్
రిత్తన్ జేసెద జన్మ, తెల్వి యగునే
శ్రీమెట్టురామేశ్వరా !

తొలిసంజెల్ వెలిగించెవెండిమలవ
త్తుల్ గద్దియన్ వన్నెలల్
చెరగెన్, మంటపమంత కుంకుమలు పూ
సెన్, సర్వసన్నాహముల్
వెలసెన్ తాండవకేళికై, మనసుప
ర్వొత్తెన్ నినుం గాంచ వ
ర్ధిలవయ్యా ! సకలాయువుల్ నినుగొనన్
శ్రీమెట్టురామేశ్వరా !

గణియింపన్ వలె మత్పురాకృతమహా
ఘమ్మంత పోగా మిగి
ల్చిన పుణ్యమ్మును; వేలజన్మలు
గతించెన్, లెక్కలేవీ ? అసల్
ఋణమున్ వడ్డిని తేల్చుకో దలచి
రానెంతున్, బయల్దేరి వ
చ్చిన వెన్కన్ మొగమోట ముండదు సుమీ
శ్రీమెట్టురామేశ్వరా !

తలదాల్తున్ గురు నాదిశంకరుల బో
ధన్ గాని సన్యాస మీ
యిలలో బొత్తిగ అచ్చిరా దని తమా
యింతున్ సరే నీకునై
కులగేహస్థల వృత్తి విత్తతతులన్
గోల్పోదు నీవున్ విరా
జిలినన్ సర్వము సన్యసించి ఎదుటన్
శ్రీమెట్టురామేశ్వరా !

మున్నెన్నండు మదిన్ స్ఫురింపని
విధమ్మున్ మొండివై నిల్వగా
నిన్నే జూచితి, ఈ అమాయకుని
నన్నే జూచితిన్, హో ! సమా
పన్నమ్మంత్య రథోత్సవమ్ము
చరమప్రస్థాన మందేని నన్
చిన్నంబుచ్చక నీభుజ మ్మిడవలెన్
శ్రీ మెట్టురామేశ్వరా !

ఎవరో వీరికి నచ్చజెప్పవలె
తా మీరీతి పద్యాలు సం
భవముల్ గావని కృష్ణమూర్తికి గురు
ప్రాగల్భ్యసంవర్తికి
య్యవి తానై రచియించి తానె వినె
తానై శ్రోతగా మెచ్చ ఆ
శివుడే చెప్పి కదల్చె వాని ననుచున్
శ్రీ మెట్టురామేశ్వరా !

ఈలోకాన నిదో విచిత్ర మెవడేనీ
మెత్తగా దోచెనా
రాలన్ రువ్వెద రొక్కరొక్కడును, నో
రాడించెనా మొత్తమున్
గాలన్ రాచెద, రాగ మాగమయి
చీకాకైన ఈ తెల్వినిన్
జేరన్ వచ్చిన చిన్నబుచ్చవుగదా
శ్రీ మెట్టురామేశ్వరా !

మరి నీ మెత్తనిగుండె నొవ్వదు గదే
మాటాడనా ఒక్క ని
ష్ఠురమీ వుండగ నన్ననాథ యని
వాక్ఛ్యాలమ్ములన్ గ్రుచ్చ నెం
దరి నోళ్లంచును మాయసాధ్య మగు
నీతాత్పర్య మేదైన, నా
చిరుతం డీ బుడతం డటం చనగదే
శ్రీమెట్టురామేశ్వరా !

ఇది నీ కంకిత మిత్తు నూత్న ప్రణయ
హ్రీముగ్ధ దాక్షాయణీ
పదనీరేజసువర్ణనూపుర మణి
స్వానంపు గీతమ్మటుల్ ,
సదయాపాంగవిలోకనామృతరసో
త్సాహమ్ము లొప్పార ఇ
చ్ఛెదవా వెండిమలన్ వసించ క్షణమేన్
శ్రీమెట్టురామేశ్వరా !







## సాహితీమిత్రులు * యువభారతి

సాహితీమిత్రులుగా యువభారతిలో చేరడం అంటే మీ అండదండలను మాకు హృదయ పూర్వకంగా అందించటానికి అంగీకరిస్తున్నారన్నమాట.

### 'యువభారతీ'యులైన సాహితీమిత్రులకు
### ఈ పథకంలో సమకూరే సదుపాయాలు:-

* ప్రతిసంవత్సరం ఐదురూపాయలు చెల్లించడంతో యువభారతి సాహితీ మిత్రులుగా పరిగణింపబడతారు.

* తక్షణమే ఒక ఉచిత పుస్తకం.

  1973 వ సంవత్సరంలో మూడు రూపాయల ప్రచురణ పూర్వ విరాళంపై ప్రచురింపబడే పుస్తకం మీకు ఉచితంగా అందుతుంది. నేరుగా అందించడంగానీ, పోస్టుద్వారా పంపడంగానీ జరుగుతుంది,

* 1973 వ సంవత్సరంలో యువభారతి నిర్వహించే సాహిత్య కార్యక్రమాల వివరాలు, అహ్వానాలు అందుతాయి.

* 1973 వ సంవత్సరంలో మీరు యువభారతి ప్రచురణలను 25% మినహాయింపుతో సొంతం చేసుకునే సదుపాయం ఉంటుంది.

* సాహితీమిత్రులు అని వెల్లడించే సభ్యత్వచిహ్నం అందుతుంది.

* యువభారతి సమావేశాలలో మీరు సాహితీమిత్రులుగా, అతిథులుగా పాల్గొనవచ్చు.

* అన్నింటికన్నమిన్న యువభారతికి తోడ్పడగలుగుతున్నామన్న సంతృప్తి; మీకా సంతృప్తి కలిగించేలా, యువభారతిని తీర్చిదిద్దడంలో మీ సహకారం అందించటం.







సమాజంలో సాహిత్యం
కావ్యలహరి చైతన్యంలా
నవలాస్యం చేయాలని
యువభారతి లక్ష్యం!
సాహితీ మిత్రులుగా
యువభారతి సంస్థ మీకు
ఆహ్వాన మందిస్తున్నది
సాహిత్య కళా సంస్కృతి సాధనకూ
సమ్యక్ శోధనకూ
విస్తృత స్నేహారాధనకూ
విశ్వశ్రేయ స్సాధనకూ
'సాహితీమిత్ర' పథకంలో
సభ్యులుగా చేరండి
విశేషాలకు, వివరాలకూ
మరువకండి!

**యువభారతి**
**సాహితీ సాంస్కృతిక సంస్థ**
**5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3**

VISTAS PRINTERS, HYD.